శ్రీ విద్యాసాధన గ్రంథమాల:—ప్రథమ పుష్పము.

# జర్మనీదేశ విద్యావిధానము.

—: కర్త :—

డాక్టర్ చిలుకూరి నారాయణరావు,
ఎమ్. ఏ., ఎల్. టి., పిఎచ్. డి.
అనంతపురకళాశాలయందు సంస్కృతాంధ్ర కర్ణాటక
భాషాధ్యాపకులు.

శ్రీ సాధన ముద్రాక్షరశాల, అనంతపురము.

1930.

 [వెల: ఒకరూపాయి.

ఆంధ్రదేశము బాగుగాగుర్తించియే ఉన్నది. అది మన దేశ భాష, అనగా దేశములో పండితపామరుల కందరికీన్ని తెలిసే భాష. అదే మన మాతృభాష. అనగా, మన తల్లుల వద్దనుంచి ఉగ్గుపాలతో నేర్చుకొన్న భాష.

ఈ గ్రంథమునకు కలిగిన ఆదరమును చూచుకొని, ఇతర విజ్ఞానబోధకములయిన గ్రంథములను ప్రకటిస్తాము.

ప్రకాశకులు.



# విషయ సూచిక.

శ్రీ

# జర్మనీదేశపు విద్యావిధానము.



## అధ్యాయము ౧.

మధ్యకాలపు జర్మనీదేశములో మూడు వందలకుపైగా పరగణాలు (States) ఉండేవి. వీటిలో కొన్ని ఛర్చి అధికారము క్రిందను, కొన్ని దొరతనము అధికారముక్రిందను ఉండేవి. ప్రషియాదేశము అభివృద్ధి పొందడము, ఫ్రాంసుదేశములో విప్లవము జరుగడము, పందొమ్మిదో శతాబ్ద మధ్యభాగములో జాతీయతాభావము విజృంభించడము, ఈమొదలైన కారణములచేత బిస్మార్కు యువరాజు తన పలుకుబడి నుపయోగించి వేరువేరుగా ఉన్న చిన్నచిన్న పరగణాల నన్నటిని చేర్చి పెద్దపరగణాలుగా చేయగలిగినాడు. 1870 సం॥లో 26 పరగణాలతో జర్మను సామ్రాజ్యము ఏర్పడినది. ఈపరగణా లన్నిటికిని ప్రషా

నాయకురాలు. ఈ ఇరవైయారు పరగణాలలో ఒక్కొకదానికి ఒక్కొక పార్లమెంటు ఉన్నది. మూలప్రభుత్వము, అనగా జర్మను సామ్రాజ్యము, నకు 'రీచ్‌స్టగ్' (Reichstag) అను ప్రత్యేక పార్లమెంటు ఉన్నది. దీనిలోని సభ్యులను ప్రజలే యెంచుకొంటారు. వాటివాటి జనసంఖ్యను బట్టిన్ని, ప్రాముఖ్యమును బట్టిన్ని, ఏపరగణావారు ఎందరు సభ్యులను ఎంచుకోవలెనో ఏర్పాటయి ఉంటుంది. ఈపార్లమెంటు అధ్యక్షుని ప్రజలే స్వయముగా ఎన్నుకొంటారు.

సైన్యము, పరదేశములతో సంబంధము, పోస్టాఫీసులు, రైళ్ళు, ఓడలు, మొదలైన వాహనములు,—ఇవి మూలప్రభుత్వమునకు సంబంధించినవి. వీటిని మంత్రులు చూస్తారు. రైళ్ళ పరిపాలనము ప్రభుత్వముచేతిలోనే ఉంటుందిగాని ఇంగ్లాండులోవలె కంపెనీలఅధికారములో ఉండదు. మూలప్రభుత్వమునకు సంబంధించని విషయములను ఆయా పరగణాల మంత్రులు చూచుకొంటారు. ఇండియాలోను ఇంగ్లాండులోను కొన్ని

పన్నులను మూలప్రభుత్వము వారున్నూ, కొన్ని టిని రాష్ట్రీయ ప్రభుత్వములవారున్నూ వసూలు చేస్తారు. జర్మనీలో ఆలాగుకాదు. మూల ప్రభుత్వమువారే పన్నుల నన్నిటిని వసూలుచేసి చట్టప్రకారము ఈపరగణాకు ఇంత అని ఆయా ప్రభుత్వముల ఖర్చులకు పంచిపెట్టుతారు. పుర పాలక సంఘములవారు మాత్రము నాటకములు, సినీమాలు, మొదలైన వినోదముల మీదనున్నూ, పురములకు కావలసిన ప్రత్యేక సౌకర్యముల కోసమున్నూ, పన్నులను విధించుకోవచ్చును.

పెద్దపరగణాలు రాష్ట్రములుగాను, ఒక్కొక రాష్ట్రము జిల్లాలు (Bezirke) గాను, ఒక్కొక జిల్లా (1) గెమెండె (Gemeinde) (2) స్టాడ్ట్ (Stadt) అనే భాగములుగాను, విభజింపబడి ఉంటవి. ఇవి ఇంగ్లాండులోని కౌంటీలు, బరోల కున్నూ, ఇండియాలోని తాలూకాలు పట్టణముల కున్నూ సరిపోతవి. బెర్లిన్ వంటి పెద్దపట్టణములకు రాష్ట్రముల హోదా ఉంటుంది.

జర్మనీ దేశములో మూలప్రభుత్వమునకు

విద్యతో సంబంధములేదు. ఆయా పరగణాలు తమ తమ విద్యాసంస్థలను తామే ఏర్పాటుచేసుకొని, తామే పరిపాలించుకోవలెను. ఇరవైయారు పరగణాలలోను ఒక్కొక్క పరగణాకు ఒక్కొక్క విద్యాంగమంత్రి ఉంటాడు. ఆతను ఆపరగణా శాసనసభకు బాధ్యతగలిగి ఉంటాడు. ఆయా శాసనసభలు మూలప్రభుత్వమువారు ఏర్పాటుచేసిన సామాన్య సూత్రములకు లోబడి తమతమ చట్టములను ఏర్పాటు చేసుకోవచ్చును. ఉపాధ్యాయులను నియమించడములోగాని, విద్యావిధానములోగాని, విద్యార్థులను బడులలో చేర్చుకొనే విషయములోగాని, మూలప్రభుత్వమువారు జోక్యము కలుగజేసుకోరు.

జర్మనీదేశములో యూనివర్సిటీ విద్యార్థులు ఏదోఒక యూనివర్సిటీలోనే ఉండిపోరు. తమ అనుభవమును వృద్ధి చేసుకొనుటకు ఒక యూనివర్సిటీనుంచి మరియొక యూనివర్సిటీకి పోతూఉంటారు. ఆఖరు పరీక్షకుమాత్రము ఏదో ఒక యూనివర్సిటీలో స్థిరపడుతారు. అందు

చేత ఒకపరగణావారి యూనివర్సిటీలో అపరగణాలోని విద్యార్థులకంటె ఇతర పరగణాల విద్యార్థులే ఎక్కువమంది ఉండవచ్చును. ఇండియాలో వలె, ఒక యూనివర్సిటీ ప్రదేశపు విద్యార్థులను మరియొక యూనివర్సిటీవారు సాధారణముగా చేర్చుకొనక పోవడము లేదు. విశ్వ విద్యాలయములన్నూ, ఉన్నత పాఠశాలలున్నూ మంత్రుల అధీనములో ఉంటవి. ప్రాథమిక పాఠశాలలు మాత్రము గెమిండె, స్టాడ్ట్ (తాలూకా బోర్డులు, పురపాలక సంఘములు) అధికారములో ఉంటవి. జర్మనీలోని విద్యాసంస్థల కన్నిటికిన్ని పెట్టుబడిపెట్టి పరిపాలించేవారు ప్రభుత్వమువారే. ప్రభుత్వమువారి సహాయమును పొందినవిన్ని, పొందనివిన్ని, ప్రయివేటుబడులు ఉన్నవిగాని అవి చాలా కొంచమే. విద్యా పరిశోధనలను చేయుడమునకు మాత్రమే అవి పనికివస్తవి.

యూనివర్సిటీలమీాద స్కూళ్ళ ఇన్స్పెక్టర్లకు అధికారములేదు. మంత్రి తనకు బదులుగా వాటినిచూడడానికి క్యూరేటర్ (Kurator)

అను ఒక సివిలియను ఉద్యోగిని నియమిస్తాడు. ఈ ఉద్యోగి యూనివర్ సిటీ పట్నములో కాపుర ముండి తనకాలమంతా యూనివర్ సిటీ పనిమీద-నే ఉపయోగించవలెను. యూనివర్ సిటీ వారికిన్ని మంత్రికిన్నీ జరిగే ఉత్తర ప్రత్యుత్తరములు ఇతని ద్వారా జరుగవలెను. ఒక రాష్ట్రములో ఉండే ఉన్నత పాఠశాలలను స్కూలే కొల్లేగియమ్ (Schule Koilegeum) అనే ఇన్‌స్పెక్టర్ల సంఘము వారు విచారిస్తారు. ఈ సంఘములో ఆయా రాష్ట్రముల విస్తీర్ణమునుబట్టి ముగ్గురినుండి ఏడు గురు వరకు ఇన్‌స్పెక్టర్లుండవచ్చును. వీరు ప్రతి ఉన్నతపాఠశాలను ఏడాదికొకసారి అయినా తనిఖీ చేసి అబిట్యూరిఎంటెన్ (Abiturienten) అనే తుదిపరీక్షను చేయవలెను. వీరు ఉపాధ్యాయుల పరీక్షలనుకూడా చేస్తారు. ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులకు జర్మనీలో ప్రత్యేకముగా ట్రెయినింగుస్కూళ్ళు లేవు. సాధారణ పాఠశాలల లోనే ఉపాధ్యాయులకు ట్రెయినింగు ఇస్తారు.

ప్రాథమిక పాఠశాలలమీద ప్రత్యేకముగా

ఒక ఇన్‌స్పెక్టరుంటాడు. ఇతను ప్రారంభవిద్యా డైరెక్టరుకే తిన్నగా రిపోర్టు పంపుకొంటాడు. ఉన్నత పాఠశాలల ఇన్‌స్పెక్టరుకు ఇతనులోబడి ఉండ నక్కరలేదు. ప్రాథమికవిద్యను గవర్నమెంట్ స్టేట్ (తాలూకా బోర్డు, పురపాలక సంఘము)ల వారే చూచుకొంటారు. ప్రభుత్వమువారు ఆ బడులకయ్యే ఖర్చును వీరికిస్తారు. ఆయా గవర్నమెంటు, స్టేట్ టులవారి అధీనములో ఉన్న బడుల లోని ఉపాధ్యాయుల, విద్యార్థుల మొత్తమును బట్టి గ్రాంటుల మొత్తమున్ను ఉంటుంది. ప్రాథమిక పాఠశాలలు స్థానిక ప్రభుత్వములవారి అధీనములో ఉన్నా, వాటిని ప్రభుత్వోద్యోగులే తనిఖీ చేస్తారు.

ఫ్రాన్సులోవలె ఒక్కొక్క మంత్రికిక్రింద అనేక డిపార్టుమెంటులుంటవి. ఒక్కొక్క డిపార్టుమెంటు ఒక్కొక్క డైరెక్టరుకిక్రింద ఉంటుంది. మంత్రికివచ్చే ఉత్తరములన్నీ ఆయాడిపార్టుమెంటుల డైరెక్టరు చూస్తారు. ఈ డైరెక్టర్లు మంత్రులకిక్రింద శాశ్వతోద్యోగులై ఉంటారు. వీరికి

ఏతరగతి పాఠశాలల సమాచారము తాము విచా రింపవలసి ఉంటుందో అట్టి పాఠశాలలలో ఉపా-ధ్యాయత్వానుభవము ఉండి తీరవలెను.

---

## అధ్యాయము ౨.

### వివిధ విద్యాసంస్థలు.

జర్మనీలో మొట్టమొదట పాఠశాలలను స్థాపించి పోషించినవారు ఛర్చివారు. కాని మార్టిన్ లూథరు, ప్రభుత్వమువారి అధికారముకూడ చర్చివారి అధికారమంత పవిత్రమైనదే అని ఒకసిద్ధాంతమును లేవదీసెను. దీనిని జర్మను ప్రజలుఆమోదించిరి. ఇందువల్ల ఆదేశపు రాజులకు బలముకలిగి, మతమును విద్యనుకూడ అభివృద్ధిచేయుటకు బాధ్యతనువహించిరి. ప్రస్తుత కాలములో ప్రభుత్వమువారే ప్రజలవిద్య విషయమై బాధ్యతను వహించియున్నారు. ప్రభుత్వమువారే సమస్త విద్యాసంస్థలను స్థాపించి, బాగుగా ఆలోచించిన పిదప విద్యా విధానమును ఏర్పాటు చేస్తున్నారు.

జర్మను పిల్లలు సాధారణముగా ఆరేండ్ల వయస్సువరకు తమ ఇండ్లలోనే చదువుకొంటారు. తల్లిదండ్రులు తమ పిల్లలచదువులను సరిగా చూచుకోలేనప్పుడు వారిని కింటర్ గార్టెన్ (Kinder-garten Schools) బడులకు పంపుతారు. తల్లి దండ్రులులేని పిల్లలనున్ను, తల్లిదండ్రులు సరిగా చూడని పిల్లలనున్ను, పోషణ గృహములకు పంపుతారు. ఈపోషణ గృహములను పురపాలక సంఘములవారు నడుపుతారు. నూటికి పది మంది మాత్రమే పిల్లలు కింటర్ గార్టెన్ బడులకు పోతారు. ఆరేండ్ల నుండి పదేండ్లవరకూ వయసు గల పిల్లలందరున్ను, గొప్పవారైనాసరే, వారి తల్లిదండ్రుల రాబడి ఎంతఅయినాసరే, చట్టముప్రకారము గ్రుంట్ షూలే (Grund schule)లేక ఐన్ హేట్ షూలే (Einheit schule) అనబడే సాధారణ పాఠశాలలకు పోయితీరవలెను. ఈ సాధారణ పాఠశాలలలో పిల్లలు జీతము లిచ్చుకోనక్కరలేదు. పేదపిల్లలకు అన్నము, బట్టలు, పుస్తకాలు కూడా ఇస్తారు.

పదేండ్ల వయస్సప్పుడు పిల్లలను మూడు తరగతులుగా ఏర్పాటుచేస్తారు. (1) ధనవంతు లైన పిల్లలు ఉన్నత పాఠశాలలకు పోతారు. ఇక్కడ వారు జీతములుచెల్లించవలెను. ఈ బడు లలో తొమ్మిదేండ్లు చదువుకోవలెను; పండొమ్మి-దోఏట అబిటుర్యేంటెన్ (Abiturienten) అనే స్కూలుఫైనలు పరీక్షలో కృతార్థులై ఏదో ఒక విశ్వవిద్యాలయములో చేరవచ్చును. (2) అంత ధనికులుకాని పిల్లలు, మిట్టెల్ షూలె (Mittel schule) అనే మాధ్యమిక పాఠశాలలలో చేరు తారు. ఈబడులు ఉత్తమతరగతిలో చేరిన బోర్డు స్కూళ్ళయి ఉంటవి. వీటిలో పదినుండి పద హారోయేడు వయస్సువరకూ ఆరు సంవత్సరములు చదువుకోవలెను. ఈబడులలో కొంచెముజీతము ఇచ్చుకోవలెను. కాని, తెలివిగల పేదవిద్యార్థు లకు నూటికి పదిమంది వంతున ఉచితముగానే విద్యనేర్పుతారు. (3) తక్కినపిల్లలు మొత్తము పిల్లలలో మూడువంతులలో రెండు వంతుల మంది ఉంటారు. వీరు పధ్నాలుగేండ్ల వయస్సువర

కున్నూ ప్రాథమిక పాఠశాలలలోనే ఉంటారు. ఆతరువాత విద్యనేర్చుకోవలెననే నిర్బంధములేదు. పధ్నాలుగేండ్ల వరకున్నూ పిల్లలందరూ ఏదో విధమైన బడిలోనికి పోయితీరవలెను. ధనవంతుల పిల్లలు ఉన్నత పాఠశాలలకు పోయి జీతములు చెల్లించుకొని పదహారేండ్ల వరకో, పందొమ్మి దేండ్ల వయస్సువరకో, చదువుకొంటారు. ఐరో-పాలోని చాలాదేశములలో నిర్బంధవిద్య పధ్నా-లుగేండ్ల వయస్సులోనరి. కొన్ని దేశములలో కొంచెము తక్కువగాకూడా ఉన్నది. ఫ్రాన్సులో పండ్రెండేండ్లకే విద్య చాలించుకోవచ్చును. ఒక పల్లెకు పరీక్ష ప్యాసైతే, పదకొండేండ్లకే మా-నుకోవచ్చును. ఇంగ్లాండు దేశములో ఈవయస్సు పదిహేనేండ్ల వరకూ హెచ్చించడానకు ప్రయ-త్నిస్తున్నారు.

జర్మనీ దేశములోని యీనిర్బంధ విద్య యొక్క గొప్ప ఏమిటంటే, మగపిల్లవాడు గాని ఆడుపిల్లగాని, పధ్నాలుగేండ్లవరకున్ను నిర్బంధముగా చదువుకొని, తరువాత ఏదైనా ఒకవృత్తి నవలం

బించవలెననిఉంటే జీతములేకుండా ఆవృత్తిని నే-ర్చుకొంటూ మూడేండ్లవరకున్ను ఒకపాఠశాలిమిక విద్యాలయమునకో ఒక వృత్తివిద్యాలయమునకో పోవలెను. ఆమూడేండ్లున్ను చదువయినతరువాత ఒకవృత్తికి సంబంధించిన పరీక్ష జరుగుతుంది. దానిలో కృతార్థులైతే, జీతముగల ఒకఉద్యోగము దొరుకుతుంది. ప్రాథమిక పాఠశాలలలో చదువు కొన్న వ్యవసాయదారుల పిల్లలుకూడా ఉన్నత గ్రామ విద్యాలయములకు పోవలెను. వాటిలో వ్యవసాయము నేర్పుతారు. దుకాణముమీద ఉండే పిల్లగాని పొలముమీద కూలి చేసుకొనే వాళ్ళగాని, పద్నాలుగునుండి పదిహేడేండ్లు వయ-స్సువచ్చే వరకున్ను ఒక వృత్తి విద్యాలయము నకు పోయి తీరవలెను

మాధ్యమిక పాఠశాలలలో పదేండ్ల వయస్సునచేరే మగపిల్లలు, ఆడపిల్లలుకూడా వాటిలో ఆరేండ్లు చదువుకొన్న తరువాత ఈ క్రిందిరీతిగా చేయువచ్చును.

(1) వారొక ఉన్నత పాఠశాలలో చేరి,

అక్కడ మూడేండ్లు చదువుకొని విశ్వవిద్యాలయమునకు పోవచ్చును.

(2) లేదా, వారొక దుకాణములోగాని ఒక పారిశ్రామిక సంస్థలోగాని చేరి, పని నేర్చుకొంటూ, మూడేండ్లు ఒక వృత్తి విద్యాలయములోనో, ఒక పారిశ్రామిక విద్యాలయములోనో, చదువుకోవచ్చును.

(3) వారు ఒక వృత్తి విద్యాలయములోనో పారిశ్రామిక విద్యాలయములోనో చేరి, తమ కాలమంతా అక్కడనే వినియోగించవచ్చును.

ఈ వృత్తిబడులలో పుస్తకవిద్య, అనుభవ విద్య కూడా నేర్పుతారు. ఆచదువు అయినతరు వాత "గెసెల్లె ప్రిఫుంగు" (Gesselle prufung) అనే ఒకపరీక్ష ప్యాసుకావలెను. మంచి పని-వాళ్ళుఉండే కొన్ని కార్ఖానాలలోనికి ఈ పరీక్ష ప్యాసయిన వారినే చేర్చుకొంటారు. అక్కడ మరిమూడేండ్లు అనుభవము కుదిరినతరువాత తిరిగీ ఒకపరీక్ష జరుగుతుంది. అందులో ప్యాసయిన వాళ్ళకు "ఆచార్య" (Master) అనే పట్టా యి-

స్తారు. బడి వదలిపెట్టిన బాలుడుగాని, బాలిక గాని, జీతములేకుండా ఏదయినా ఒక శాఖానాలో పనిచేయవచ్చును. కాని, పై "గెసెల్లె" పరీక్ష ప్యాసయితేనేగాని జీత మివ్వరు. "ఆచార్య" పట్టాను పొందితేనేకాని స్వంతముగా ఒక వృత్తిని అవలంబించడానికి వీలులేదు.

ఇక, పదేళ్ళవయస్సున ఉన్నతవిద్యాలయా లలో చేరే పిల్లలనుగురించి ఆలోచించుదాము. ఉన్నత విద్యాలయాలలో (High Schools) తొమ్మిదేండ్లు చదువుకోవలెను. సాధారణముగా పందొమ్మిదో యేట పిల్లలు ఈబడిలోని తుదిపరీక్షను (Abiturienten) ప్యాసవుతారు. అప్పుడు వారు కళలు, విద్యలు, శాస్త్రములు, వృత్తులు, నేర్పే విశ్వవిద్యాలయాలలో చేరుతారు. ఇంజినీరింగు, వర్తకము, వ్యవసాయము, అడవులు, వీటినిగురించి చెప్పే కళాశాలలు ప్రత్యేకముగా ఒక్కొకటి ఒక్కొక విశ్వవిద్యాలయమై ఉండి, సాధారణ పట్టాలను, డాక్టరు బిరుదమునుకూడా ఇవ్వవచ్చును. "అబిట్యూరిఎంటెన్" (Abituri-

enten) పరీక్షకు బడిలో చదివికాని, ప్రయివేటుగా గాని ప్యాసయితేనే కాని, ఉన్నత పారిశ్రామిక కళాశాలలో ప్రవేశించడానికి వీలులేదు. ప్రయివేటుగా ప్యాసుకావడము క్రొత్తగా వచ్చినది. ఈప్రియివేటు పరీక్షకు "ఇంటెలిజెన్సు టెస్టు" (Intelligence Test) అంటారు. డాక్టరు బిరుదమునకు ఆయా విశ్వవిద్యాలయాలలో నాలుగేళ్ళనుంచి ఏడేళ్ళ వరకు చదువుకోవలెను. తొమ్మిదేళ్ళన్న పూర్తిగా ఉన్నత విద్యాలయములో (High School) చదువుకోలేని విద్యార్థులు, మాధ్యమిక పాఠశాలలోనుంచి వచ్చేవారివలె ఉన్నత వృత్తివిద్యాలయాలలో (Secondary Technical Institutes) చేరవలెను.

వయస్సు మించినవారి విద్య ఈమధ్య చాలా అభివృద్ధిచెందినది. జ్ఞానాభివృద్ధిని కోరే స్త్రీ పురుషుల కోసము "ఫోక్ హాక్ షూలె" Volkhoch Schule) అనే ప్రత్యేక విద్యాలయాలను ఏర్పాటుచేసినారు. అచ్చటజరిగే ఉపన్యాసాలను వినడానికి జీతమిచ్చుకోవలెను. ఆ ఉప

న్యాసాల కందరున్ను పోవలెననే నిర్బంధముకూడా లేదు. అయినా ఈబడులలోనికి జనసంఖ్యలో నూటికి ఒకరు విద్యార్థులుగా పోతూనేఉన్నారు.

మగపిల్లలకున్ను, ఆడపిల్లలకున్ను, ఉన్నత విద్యాలయాలు వేరువేరుగా ఉన్నవి. ఆడపిల్లల ఉన్నతవిద్యాలయాలకు "లిజెయమ్" (Lyzeum) అనిపేరు. ఇందులో ఆరేళ్ళు చదువుకోవలెను. ఈ ఆరేళ్ళు చదువయిన తరువాత బాలికలు (1) ఉన్నత పారిశ్రామిక పాఠశాలలో (Secondary Technical School) చేరవచ్చును. లేదా (2) గృహనిర్వాహకత్వమును నేర్పే వసతిగృహాలలో (Boarding Schools) చేరవచ్చును. లేదా (3) మరిమూడేళ్ళు "ఓబర్ లిజెయమ్" అనేబడులలో చదువుకొని, ఒక విశ్వవిద్యాలయములోనో, పారిశ్రామిక కళాశాలలోనో చేరవచ్చును.

——

## అధ్యాయము 3.

### ప్రాథమిక విద్య.

ప్రాథమికవిద్యకున్ను, ఉన్నత విద్యకున్ను భేదము కాల్పనికమేకాని, వాస్తవము కాదని క్రిందటి అధ్యాయములో తెలుపబడ్డది. ఈ అధ్యాయము నిమిత్తము ప్రాథమిక విద్యాలయా లంటే, ఆబడులలో జరిగే తుదిపరీక్ష విశ్వవిద్యాలయాలలోనికి ప్రవేశము కల్పించ నటువంటివి అని నిర్వచనము చేయవచ్చును.

ప్రాథమికవిద్య "గమిండె", "స్టాడ్ట్" అనే స్థానికపరిపాలనమువారి చేతులలోనే ఉన్నదని మొదటి అధ్యాయములో చెప్పబడ్డది. ఈ ప్రాథమికవిద్యాలయాలకు సాధారణముగా డబ్బంతా మూలప్రభుత్వమువారే ఇస్తారు. ఆ విద్యాలయాలకు గ్రాంటులు, ఆయాబడులలోని ఉపాధ్యాయులసంఖ్యను బట్టిన్ని, విద్యార్థుల సంఖ్యనుబట్టిన్ని ఉంటుంది. ఉపాధ్యాయులసంఖ్యను బట్టి మాత్రమే గ్రాంటులిస్తే, ప్రతి బడిలోను కావలసినంత మందికంటె ఎక్కువమంది ఉపాధ్యా

యులు చేరుతారు. ఒక్క విద్యార్థులసంఖ్యను బట్టి మాత్రమే గ్రాంటు లిస్తే, బాలురసంఖ్య ఎక్కువఅయి, ఉపాధ్యాయులసంఖ్య తగ్గిపోతుంది. అందుచేత ఈ యిద్దరిసంఖ్యను బట్టిన్ని గ్రాంటు లివ్వడమువల్ల హెచ్చుతక్కువలు రావు.

(1) కిండర్ గార్టెన్ బడులు (Kinder Garten School).

(2) గ్రుంట్ షూలె (Grund Schule) లేక సాధారణ బడులు. వీటికి "ఐన్‌హేట్ షూలే" (Einheit Schule) అనికూడా పేరు.

(3) ఫోక్ షూలె ( Volk Schule ) ఇవే బోర్డుపాఠశాలలు. వీటిలో పిల్లలు జీతము చెల్లించ నక్కరలేదు.

(4) మిట్టెల్ షూలె (Mittal Schule) అనగా మాధ్యమిక పాఠశాలలు. (ఇవి ఫ్రాంసు దేశములోని "ఇకోలె ప్రైమేర్ సుపీరియార్" (Ecoles primaires superioures) అనే బడులకు సరిపోతవి. కాని వీటిలోని "గ్రుంట్‌షూలె" లోని పిల్లలుమాత్రమే చేరవలెను. "ఫోక్‌షూలె"

లోని వారికి ప్రవేశములేదు

పైరీతిగా ప్రాథమిక విద్యాలయాలు నాలుగు విధములుగా ఉన్నవి.

ఈ బడు లన్నిటిలోని ఆడపిల్లలు, మగపిల్లలుకూడా కలిసి చదువుకొంటారు. పట్టణాలలో పిల్లలసంఖ్య ఎక్కువగాఉన్న బడులలో ఆడపిల్లల నందరినీ ఒకభాగములోను, మగపిల్లల నందరినీ మరిఒక భాగములోను ఉంచుతారు. కొన్ని స్థలాలలో, ఆడపిల్లల బడులున్ను, మగపిల్లల బడులున్ను, వేర్వేరుగా ఉంటవి.

మొత్తముమీద, ఆడపిల్లలకున్ను, మగపిల్లలకున్ను నేర్పేవిద్య ఒక్కటే. కాని, మగవారికి వడ్రంగము, కమ్మరము, పదార్థవిజ్ఞానశాస్త్రము, ఎక్కువగా నేర్పుతారు. ఆడపిల్లలకు వంట, కుట్టుపని, నృత్యశాస్త్రము ఎక్కువగా నేర్పుతారు. వేసే ప్రశ్నలలోను, చూపే బొమ్మలలోను కూడా మగబడులకున్ను, ఆడబడులకున్ను భేదమున్నది. ఆడపిల్లలబడులలో సాధారణముగా ఆడవాళ్ళే ఉపాధ్యాయులుగా ఉంటారు.

గ్రామ బడులకున్ను, పట్టణపు బడులకున్ను చెప్పే విషయములసంఖ్య ఒక్కటేగాని, బోధన చేసేతీరుమాత్రము వేరుగా ఉంటుంది రెండు విధాల బడులలోను లెక్కలు చెప్పుతారు గాని, ఇచ్చేప్రశ్నలు మాత్రము వేర్వేరుగా ఉంటవి. ఒకరీతి బడికి పనికివచ్చే పుస్తకము, రెండోరీతి బడికి పనికిరాక పోవచ్చును.



## అధ్యాయము ౪.

### "కిండర్ గార్టెన్" బడులు.

"కిండర్ గార్టెన్" అంటే జర్మనుభాషలో "పిల్లలతోట" అనిఅర్థము. ఫ్రోబెల్ అనే గొప్ప ఉపాధ్యాయుడు పిల్లలకు పుస్తకాలద్వారా విద్య నేర్పకూడదనిన్ని, ఆటలు, సరదాల మూలముగా నేర్పవలసిన దనిన్ని చెప్పి, ఇరవై ఆటలను కల్పించి నాడు. వీటికి "ఫ్రోబెల్ బహుమానముల్లు" అని పేరు. పిల్లలు ఈఆటలలో ఉత్సాహము చూపే టట్లు అతడు చేసినాడు. వాటి మూలముగా

వారికి విద్యాభివృద్ధి చేసినారు. ఫ్రోబెల్ అనం తరము అతనిపద్ధతి ననుసరించినవారు, అతని అభి ప్రాయమును కనుక్కోలేక, అతడేబహుమానా లను ఏర్పరచినాడో వాటినే గుడ్డిగా అవలంబించి నారు. అందుచేత పిల్లలకు వాటిలో ఉత్సాహ ము పుట్టకపోయినది. ఆటలమూలముగా విద్య నేర్పవలెననిన్నీ, పైనిర్బంధమేమీ విద్యావిషయ ములో పిల్లల కుండకూడదనిన్నీ, మాత్రమే ఫ్రో- బెలు అభిప్రాయము. మొన్నటి యుద్ధమునకు పూర్వమే ఈబహుమానములమీద పిల్లలకు ఆసక్తి పోయినది. అది చూచి, డాక్టరు మాంటిసారీ అనేఆమె మరిఒక పద్ధతిమీద పిల్లలకు కొన్ని ఆట లను కల్పించినది. ఫ్రోబెలు పద్ధతి మంచిదా, మాంటిసారీపద్ధతి మంచిదా, అనే విషయములో ఇంకా వివాదము జరుగుతూనే ఉన్నది. పిల్లలకు అవకాశము (Space) ధ్వని, రంగులు, పొడవులు అనే విషయములనుగూర్చిన జ్ఞానము నివ్వడానికి అనేకమైన పనిముట్లను కల్పించినది. ఆ తరువాత కొక్కెములు, గుండీలు మొదలయిన సాధారణ

మైన వస్తువులను తన విద్యాపద్ధతికి సాధనాలుగా ఏర్పాటు చేసినది. ఇప్పుడు జర్మనీలోను, ఇంగ్లాండులోనుకూడా, ఇవే బహుమానము లుండవలెననే అభిప్రాయము పోయినది. ప్రతి ఉపాధ్యాయురాలున్ను, తన చుట్టుప్రక్కల కనుగుణముగాఉండే బహుమానాలను ఏర్పాటు చేసుకొంటుంది. ఫ్రోబెల్ పద్ధతి మంచిదేకాని, దానిని ఉపయోగించడములో తప్పులు చేస్తున్నా రని విద్యాధికుల అభిప్రాయము. ప్రపంచ మంతటా ఫ్రోబెల్ ఏర్పాటుచేసిన బహుమానములే ఉండవలెననడము అతని అభిప్రాయానికి విరుద్ధము. ప్రతి ఉపాధ్యాయినియున్ను తన బహుమానాలను పిల్లల తెలివి తేటలను బట్టి తానే ఏర్పాటు చేసుకోవలెను. ఈ బహుమానాలకోస ముపయోగించే పదార్థములు బెడదలేకుండా, పిల్లలకు తెలిసినవై ఉండవలెను.

జర్మనీలో నూటికి పదిమంది పిల్లలు ఈ కింటర్ గార్టెన్ బడులకు పోతారు. తక్కిన తొంభైమందిన్ని తమ యిళ్ళలోనే చదువుకొంటారు

పట్టణాలలో కిండర్ గార్టెన్ బడులలోనికి పోయే వారి సంఖ్య ఎక్కువగా ఉంటుంది. ఈ బడుల లోనికి పిల్లలను మూడేళ్ళ వయస్సున పంపిస్తారు. అక్కడ వారు ఆరేళ్ళవయస్సు వరకూ ఉంటారు. పిల్లలు చదవడానికి పుస్తకాలేమీ ఇవ్వరు. బొ-మ్మలు వ్రాయడము, లెక్కపెట్టడము, పాట పాడడము, పిల్లలు తమంతట తామే నేర్చు కొంటారు.

కిండర్ గార్టెన్ బడులకున్ను ప్రాథమిక విద్యాలయాలకున్ను ఎట్టి సంబంధమూ లేదు. రెండుబడులు మాత్రము అట్టివి వున్నవి. వాటి లో ఒకదానిలో విద్యావిషయమును బోధించే ఒక అధ్యాపకుడు (Professor) ఫ్రొబెలు, మాం టిసొరీ పద్ధతులను ఎట్లు సమన్వయము చేయడ మని పరిశోధనలు చేస్తున్నాడు. ఇంగ్లాండులో వలె కాక, జర్మను విశ్వవిద్యాలయాలకున్ను బోధ నాభ్యసన కళాశాలలకున్ను సంబంధము లేదు.

తలిదండ్రులు సరిగాచూడని పిల్లలకున్ను, చెడుసహవాసమువల్లగాని, తలిదండ్రుల ముద్దు

చేతగాని చెడిపోయే పిల్లలకున్ను, మాత్రమే ఈ కింటర్ గార్టెన్ బడులు పనికి వస్తవి. ఆరేళ్ళలోపు పిల్లల యెదుట దేశపటము లుంచి వ్రాత, చదువులను నేర్పి, వారి మనస్సులలో ఆయా విషయములను కుక్కకూడదు. ఆయా ఆటలను ఉపాధ్యాయినులే ఏర్పాటు చేయవలెను. అవి సాధారణముగా పిల్లలు బడులలోను బయటను చూచేవిగానే ఉండవలెను.

పిల్లల మొత్తముసంఖ్యలో నూటికి ఇరవై ఇద్దరు ఈకింటర్ గార్టెన్ బడులలో చదువు కొంటారు. కాని, ఈబడులలో చదువుకొనే పిల్లల కంటె, ఇంటివద్ద చదువుకొనే పిల్లలే ఎక్కువ తెలివి తేటలు గలవారని తెలియవస్తున్నది.



# అధ్యాయము ౫.

## "గ్రుంట్ షూలె లేక ఐకా హేట్ షూలె"

### సాధారణ పాఠశాలలు

జర్మను దేశ మంతా ఏకముగా ఉండవలె నంటే, ధనికులు పేదలు అనే భేదము లేకుండా అందరికీ సాధారణముగా బడులు ఉండవలెననిన్నీ కొద్దికాలములో ప్రారంభవిద్యనుంచి కళాశాలా విద్యవరకు విద్య అంతా జర్మనుజనుల కందరికీ సామాన్యముగా ఉండగలదనిన్నీ, 1848 సం॥ ములో సేవెర్ను అనే రాజకీయవేత్త పలికినాడు. మొన్నటి యుద్ధసమయములో అనేక అంతరువుల మనుష్యులు సైనికులుగా ఒకరితో ఒకరు కలియ వలసివచ్చినది. అప్పటినుంచి ఆయా అంతరువుల మనుష్యులకు ఇంకాదగ్గఱ సాంఘిక సంబంధము కుదురుకోవలసినదనే అభిప్రాయము దృఢపడినది. జర్మను చక్రవర్తి అయిన కెయిజరు ఇరవై యారు రాష్ట్రములను జర్మను సామ్రాజ్యములోనికి తెచ్చి, జర్మనీదేశమంతా ఒక్కటేదేశమనే ఊహను నెల కొల్పినాడు. కాని, యుద్ధము ముగియగానే,

ఆ ఐక్యమంతా చెదిరిపోయి, ఎప్పటివలె ఆయా రాష్ట్రములు ప్రత్యేకముగా విడిపోతవనే భయము కలిగినది. అయినా, విద్యాసంబంధమైన ఐకమత్య మొకటి ఈమధ్య తలచూపి, జర్మనుభాష మాట్లాడే జనులందరున్ను ఒకదేశమువారే అనే భావము ప్రబలుతున్నది. ఈ ఐకమత్యము నిలకడ పొందవలెనంటే, సాంఘిక విభేదములను పాటించని సాధారణ విద్యావిధానమున్ను, సాధారణ విద్యాలయములున్ను, కావలెను. 1920 సం॥లో జర్మనుసామ్రాజ్య విద్యాసభ కూడి, ఈభావమును బలపరచి, దేశమందంతటా సాధారణ విద్యాలయములు స్థాపితములు కావలెనని తీర్మానించినది. ఆమరుసటి సంవత్సరము మూలప్రభుత్వ శాసన సభలో (Reichstag) ఉన్నత విద్యాలయముల లోని క్రింది నాలుగు తరగతులను తీసి వేయవలసిన దనిన్ని, వాటిని వేరేఏర్పాటుచేసి అందులో ధనికులు పేదవారు అనే భేదముగాని, వృత్తులభేగముగాని పాటింపక, అందరుపిల్లలను చేర్చుకోవలసినదనిన్ని, ఒకశాసనము చేయబడ్డది.

జర్మనీ దేశములో విద్యా పరిపాలనము మూలప్రభుత్వమువారిది కాదనిన్ని, అది రాష్ట్రీయప్రభుత్వముల వారిదనిన్ని, ఇంతకుముందు తెలుపబడినది. ప్రతి రాష్ట్రమున్ను తనబకుల పరిపాలనము నిమిత్తము కట్టుదిట్టమును చేసుకోవలెను. అందుచేత మూలప్రభుత్వ శాసనసభ (Reichstag) నిర్వచించిన పద్ధతిప్రకారము, ఆయా రాష్ట్రముల శాసనసభలవారు కూడా శాసనములను చేసుకొని, ఇప్పుడు దేశమందంతటా ఈ సాధారణ విద్యాలయాలను స్థాపించినారు. ఇప్పుడీ ఉద్యమము ఒక్క జర్మనీదేశములో మాత్రమే అమలులో ఉన్నది. స్విట్జరులాండు దేశముకూడా ఈపద్ధతి నామోదించినది. యుద్ధానికి పూర్వము బాలబాలికలను ఉన్నత విద్యాలయాలలోనికి ప్రవేశపెట్టడానికి ఏర్పడిన "ఫార్ షూలే" అనబడే ప్రారంభవిద్యాలయాలు ఉన్నత విద్యాలయాలకు అనుబంధములుగానో, ప్రత్యేక విద్యాసంస్థలుగానో ఉండేవి. ఇప్పుడవన్నీ అంతరించిపోయినవి. ధనవంతులుగానీ, పేదవారుగానీ,

వారుముందుముందు అవలంబింపబోయే వృత్తు లతో సంబంధములేకుండా నాలుగేళ్ళు ఒక్కటే బడిలో చదువుకొని, ఒకటేరీతి విద్యను నేర్చుకొంటున్నారు. ఈ బడులకు "గ్రుంట్‌షూలె" లేక పునాదిబడులని కాని, "ఐన్‌హేట్‌ షూలె" లేక ఏకత్వ విద్యాలయములనికాని పేళ్ళు. వీటిని ప్రారంభ విద్యాలయాలతో కలిపికాని, ప్రత్యేకముగాకాని, స్థాపించుతున్నారు. వీటిలో పిల్లలు జీత మివ్వ నక్కరలేదు వీటిలోని పేదపిల్లలకు పురపాలక సంఘములవారు ఉచితముగా తిండిపెట్టి పుస్తకాలిచ్చి, ఒకొక్కప్పుడు బట్టలుకూడా ఇస్తారు. పిల్లలందరున్ను ఒక్కటేమోస్తరు దుస్తులు ధరించవలెననే నియమములేదు. కాని, పిల్లలదుస్తులను బట్టి వీరు గొప్పవారు, వీరు పేదవారు, అని తెలుసుకొనడము కష్టము. ఇప్పుడు ప్రపంచములో ప్రబలుతూఉన్న సర్వసామాన్యస్వత్వమనే ఊహ ననుసరించే ఈబడులు స్థాపితము లవుతున్నవి.

ఈబడులను తల్లిదండ్రులు, పిల్లలు, ఉపాధ్యాయులు, అందరున్ను మెచ్చుకొంటున్నారు.

ధనవంతుల పిల్లలు మిక్కిలి పేదవారి పిల్లలతో కలసి మెలసి, వారితోపాటే చదువుకొంటారు. వేర్వేరు అంతరవులపిల్లలు ఒకరితో ఒకరు నేస్తము కలుపుకొంటారు. గొప్పవారి పిల్లలు తమ పుట్టిన దినములకు పేద పిల్లలను విందుకు పిలుస్తారు. మీదు మిక్కిలి గొప్పవారి పిల్లలకు తమలో తమకు పడదట! వారు దెబ్బలాడుకోకుండా వారి మధ్యను పేదపిల్లలను కూర్చో పెట్టవలసిఉంటుందట! కాని, ధనవంతులపిల్లలు, కార్మిక కుటుంబముల వారికంటె ఎక్కువ తెలివి తేటలు గలవారుగా ఉంటారట.

పాఠక్రమములు, బోధన విషయములు, ఏవిషయము నెన్నిన్నిగంటలు బోధించడము, ఈ మొదలయిన వాటిని విద్యాంగమంత్రి ఏర్పాటు చేస్తాడు. ఉన్నత విద్యాలయాల కనుగుణముగా ఈవిషయములు నిర్ణయింపబడుతవి. పిల్లలకు దినమునకు మూడుగంటలు మాత్రమే చదువు. వారమునకు మూడుసార్లు పిల్లలు ఉపాధ్యాయులతో విహారాలకు పోతారు. బడిగదులలో కావలసిన

పటములున్ను, ఇతర విద్యాసాధనములున్ను కావలసినన్ని ఉంటవి. పిల్లలు ఎత్తున గది గోడలకు నల్లని రంగుపూసి ఉంటారు. పిల్లలు వాటిమీాద వ్రాసుకొంటారు. ఇందువల్ల ఒకతరగతి పిల్లలలో సగముమంది ఒక్కసారిగా వ్రాసుకొనడానికి వీలవుతుంది.

---

## అధ్యాయము ౬.

### ప్రారంభవిద్యాలయములు. (ఫోక్ షూలె)

జర్మనీ దేశములో బాలబాలిక లందరు నిర్బంధముగా ఆరేళ్ళ వయస్సునుంచి పద్నాలుగేళ్ళ వయస్సు వరకూ విద్య నేర్చుకొనవలెనని శాసన మున్నది. ఈ యెనిమిదేళ్ళలో మొదటి నాలుగేళ్ళున్ను క్రిందటి అధ్యాయములో చెప్పబడిన సాధారణ పాఠశాలలలో పదేళ్ళ వయస్సు వరకూ అందరునూ చదువుకొనవలెను. ఆ తరువాత జీతము లిచ్చుకొని ఉన్నతవిద్యాలయములలో చదువుకోలేనివాళ్ళు సాధారణ పాఠశాలల

లోనే పరినాలుగేళ్ళు చదువుకొంటారు. ఈ ప్రారంభ పాఠశాలలు (1) ఫోక్‌షూలె (Volk schule) లేక ప్రజలబడులు (2) మిట్టెల్‌షూలె (Mittel schule) లేక మాధ్యమిక పాఠశాలలు అని రెండు విధములుగా ఉంటవి. గ్రామాలలోని బడులకున్ను పట్టణములలోని బడులకున్ను కొంచెము భేదమున్నది. ఈభేదము ముందు అధ్యాయములో తెలుపబడును.

## మిట్టెల్ షూలె (Mittel schule)·

### మాధ్యమిక విద్యాలయములు.

దేశముయొక్క కార్మిక. వాణిజ్యాభివృద్ధుల కోసము కూలిపనివారికంటె ఎక్కువ వారున్ను, కళాశాలలలో చదువుకొనిన వారున్నూ అయిన ఒకతెగ జనులు కావలసివచ్చినది. అందుకోసము ఉచితవిద్య నిచ్చే బోర్డుస్కూళ్ళకున్ను, ఉన్నత పాఠశాలలకున్ను, మధ్యగా (మిట్టెల్‌షూలె) అను మాధ్యమిక పాఠశాలలు ఏర్పాటైనవి. ఈమాధ్యమిక పాఠశాలలకున్నూ ప్రారంభ పాఠశాలలకున్ను సంబంధము లేదు. అవి ప్రారంభ,

ఉన్నత పాఠశాలలకంటె వేరుగా ఉంటవి. వాటి లోని విద్యావిధానము కూడా వేరుగా ఉంటుంది. మిట్టెల్‌షూలె (Mittel schule) లోనికిన్ని ఫోక్ షూలె (Volk schule) లోనికిన్ని బాలురు పదేళ్ళ వయస్సప్పుడే చేరినా మాధ్యమిక పాఠశాలలలో ఉపాధ్యాయులు ఎక్కువ విద్యానుభవము కల వారుగా ఉంటారు. వీటిలో సంవత్సరానికి ఎని మిది పౌనులనుండి పన్నెండుపౌనుల వరకు నామ కాగా పిల్లలు జీతము చెల్లించవలెను. ప్రారంభ పాఠశాలలలో ఉచితవిద్య నాలుగేళ్ళు నేర్పు తారు. మాధ్యమిక పాఠశాలలలో 6 ఏళ్ళు చదువుకోవలెను. ప్రారంభ పాఠశాలలలో మ -తము, జర్మనుభాష, రాజనీతిలో ప్రథమ పాఠ ములు, భూగోళశాస్త్రము, ప్రకృతి పరిశీలనము, అనుభవ పదార్థవిజ్ఞానశాస్త్రము, లెక్కలు, క్షేత్ర గణితము, చిత్రలేఖనము, సంగీతము, కసరత్తు, చేతిపనులు, తోటపని,—ఇవి బాలురకున్ను ఇవి కాక బాలికలకు కుట్టుపని, వంటలున్నూ నేర్పు తారు. ఈ ప్రారంభ పాఠశాలలలో నేర్పేవిష

యములే కాకుండా, మాధ్యమిక పాఠశాలలలో ఒకటిగాని ఎక్కువగాని పరదేశభాషలును, చిత్రా ఆవర్గాలు వ్రాయడమున్ను, పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, కొన్ని బడులలో జీవశాస్త్రముకూడా నేర్పుతారు. సామాన్యవిషయములను బోధించే పద్ధతిలోకూడా భేదమున్నది. ప్రాథమిక మాధ్యమిక పాఠశాలలను స్థానిక ప్రభుత్వమువారే పరిపాలిస్తారు. మూల ప్రభుత్వమువారు వారికి గ్రాంటులిస్తారు. ఆ పాఠశాలలలోని ఉపాధ్యాయుల సంఖ్యనుబట్టిన్ని పిల్లల సంఖ్యను బట్టిన్ని గ్రాంటు ఉంటుంది గాని, బడులకన్నిటికిన్ని మొత్తముగా గ్రాంటు ఉండదు. ఈ పద్ధతి ప్రకారము ఒకొక్కతరగతిలో చాలా ఎక్కువమంది పిల్లలను చేర్చుకొనడముగాని, కావలసినంతమందికంటె ఎక్కువమంది ఉపాధ్యాయులను నియమించడముగాని జరుగదు. ఈ మాధ్యమిక పాఠశాలలోని పిల్లలను పూర్వము యూనివర్సిటీలలో చేర్చుకొనేవారు కారు. కాని 1902 సం॥ మున ఈ అడ్డంకిని తీసివేసినారు. ఇప్పటి విద్యార్థి

మము ప్రకారము పిల్లలు 16 ఏళ్ళ వయస్సున ఉన్నత పాఠశాలలలో చేరి, అబిట్యూర్యరియెంటెన్ (Abiturienten) పరీక్ష ప్యాసై విశ్వవిద్యాలయములలో చేరవచ్చును. ఈ మాధ్యమిక పాఠశాలలలోని పైతరగతులలో నాలుగు తరగతులున్నవి. పిల్లలు వాటిలో ఏదో ఒక భాగములో చేరవచ్చును. ఒక మాధ్యమిక పాఠశాలలోని పైతరగతియొక్క పాఠక్రమము ఈ క్రింద చూపబడినది.

| విషయము. | సాధారణ భాగము. (అ) | పురాతనభాష భాగము (ఆ) | వాణిజ్య భాగము (ఇ) | పారిశ్రామిక భాగము (ఈ) |
|---|---|---|---|---|
| 1. మతము ... | 2 | 2 | 2 | 2 |
| 2. జర్మనుభాష ... | 5 | 4 | 5 | 6 |
| 3. ఇంగ్లీషు ... | 4-5 | 4 | 3-5 | 3-4 |
| 4. ఫ్రెంచిభాష ... | 5-6 | 4-5 | 3-5 | 3-4 |
| 5. లాటిను ... | లేదు | 7 | (ఇంగ్లీషు తీసు కోకపోతే లేదు) | (ఇంగ్లీషు తీసు కోకపోతే లేదు) |
| 6. భూగోళశాస్త్రము ... | 2 | లేదు | 2 | 2 |
| 7. చరిత్రము ... | 2 | 4 | 2 | 2 |
| 8. లెక్కలు, గణితము ... | 4 | 5 | 4 | 4 |
| 9 చిట్టాఆవర్జాలు, లేక క్షేత్రగణితము | లేదు | లేదు | 2 | 3 |
| 10. ప్రకృతిశాస్త్రము ... | 3-4 | 3-4 | 2-3 | 4-5 |
| 11. చిత్రలేఖనము ... | 3 | 2 | 2 | 4 |
| 12. కసరత్తు ... | 3 | 3 | 3 | 3 |
| 13. చేతిపని తోటపని మొదలైనవి... | 2[ఐచ్ఛికము] | లేదు | 2 | 2 |

జర్మనీదేశము జనసంఖ్య ఆరుకోట్ల ఇరవై లక్షలు. వీరిలో ఈబడులలో చదువుకొనే పిల్లల సంఖ్య 70 లక్షలు. వీరికోసము 54,500 ప్రారంభపాఠశాల లున్నవి. వీటిలో 1744 మాధ్యమిక పాఠశాలలు. చదువుకొనే ఆడపిల్లలసంఖ్య మగపిల్లలసంఖ్య సరిగా ఉంటుంది. మాధ్యమిక పాఠశాలలలోని పిల్లలు మొత్తములో నూటికి అయిదుమంది ఉంటారు. ప్రారంభ పాఠశాలల లోని ఉపాధ్యాయులసంఖ్య 2,10,300 వీరిలో నూటికి ఇరవై యిద్దరు ఆడవాళ్ళు. సగటున ఒక ఉపాధ్యాయునికి 33 3మంది పిల్ల లుంటారు.

మిశ్రితవతరగతులు.

ఆడపిల్లలను మగపిల్లలను కలిపి ప్రారంభ, మాధ్యమికబడులలో చదువుచెప్పడము విషయమై జర్మనీ దేశములో వివిధాభిప్రాయము లున్నవి. కొన్నిబడులలో ఇద్దరినీకలిపే చెప్తారు. గ్రామ బడులలో ఇదితప్పనిసరి. చిన్నపట్టణాలలో ఆడ పిల్లలు, మగపిల్లలు కలిసి ఒకటేబడిలో చదువు కొంటారుగాని, వారిని వేర్వేరు క్లాసులలో ఉంచు

తారు. పాఠక్రమము (Time table) కోసము ఈరీతిగా చేస్తారట. ఈబడులలో ఆటలలోకూడా ఆడపిల్లలున్ను, మగపిల్లలున్ను ఒకరినొకరు కలుసు కోవడ ముండదు. పెద్దపట్టణాలలో సర్వసాధా రణముగా ఆడపిల్లలకున్ను, మగపిల్లలకున్ను బడులు వేర్వేరుగా ఉంటవి.

జర్మను విద్యాపద్ధతి జయప్రదము కావ డానికి మూలప్రభుత్వమువారు అచ్చువేసిపంపే పాఠక్రమములు కారణముకాదు ఆయా విష యాలను నేర్పే పద్ధతియే కారణము ఆ బడు లలో ఏవిన్ని పఠనీయగ్రంథములు నిర్ణీతములుగా ఉండవు. ఉపాధ్యాయులు తమ పాఠములను తామే ఏర్పరుచుకోవచ్చును. క్రొత్త రాజకీయ పరిస్థితులనుబట్టి మూల ప్రభుత్వమువారు క్రొ-త్తగా పఠనీయ గ్రంథాలను ఏర్పాటు చేస్తున్నారు. ఉపాధ్యాయులు జ్ఞానమును పిల్లలలోనికి క్రుక్కరు. పిల్లలు తమంతటతామే ఆయావిషయాలను తెలు సుకొనేటట్లు సహాయము చేస్తారు. ఏదో ఒక విషయమును తానే కనుక్కొంటున్నాననిన్ని, తన

లోనికి అజ్ఞానమును ఉపాధ్యాయుడు త్రిక్కలే దనిన్నీ పిల్లలు ఉత్సాహ పడతారు. విద్య పిల్లలజీవనానికి సంబంధించి ఉంటుంది కాని, ఎక్కడివో సంగతులను పిల్లలకు చెప్పరు. ఇంటి జీవనమునకున్ను, బడిజీవనమునకున్ను వ్యత్యాసముండదు. పిల్లలు బడులలో ఒకకాల్పనిక ప్రపంచములో ఉండరు. పిల్లల పరిశీలనశక్తిని అభివృద్ధి చేయడమే అతిముఖ్యమనే సంగతిని ఉపాధ్యాయులు మరచిపోరు. ఈ పరిశీలనశక్తిని అభివృద్ధి చేయడానికి గ్రామపట్టణముల జీవనము, కార్మిక జీవనము, మొదలయినవాటిని తెలిపే అనేక పటములను ఉపయోగిస్తారు. జంతువృక్ష జీవనమును తెలుసుకొనడము, వాతావరణమును గురించి తెలుసుకోవడముకూడా ఈబడులలో నేర్చుకొనేటట్లు చేస్తారు.

యుద్ధమునకు పూర్వము కసరత్తు, కవాతు నిర్బంధముగా చెప్పుతూ ఉండేవారు. ఇప్పుడు వాటికి బదులుగా ఆటలు, వ్యాయామక్రీడల మీద హెచ్చుశ్రద్ధ చూపిస్తున్నారు. బడిపిల్లలకు

ఆటస్థలముకోసము ఒక్క బెర్లిను పట్టణములోనే ఎన్నో మిలియనుల పౌనులు ఖర్చు పెట్టినారు. ఇంగ్లీషువారి విజయమునకున్ను శీలమునకున్ను, వారి వ్యాయామక్రీడలే ముఖ్యకారణములని అనుకొనడము చేతనున్ను, "వాటర్లూ యుద్ధములోని జయము ఈటనుబడి ఆటస్థలములలో కలిగినది," అనే మొదలయిన అభిప్రాయముల చేతనున్ను, ఈరీతిగా జర్మనులు వ్యాయామక్రీడలపైని ఎక్కువ శ్రద్ధ తీసుకొంటున్నారు. బడిపిల్లలు విహారయాత్రలు చేయవలసినదనే భావము పెరుగుతున్నది. నెలకు ఒకసారిఅయినా బడిపిల్లలందరున్ను శాస్త్రపరిశోధనల కోసము విహారమునకు పోవలెను.

## మత విద్య.

జర్మనీలో చాలమంది ప్రొటెస్టాంటు మతస్థులో, ఇవాంజెలికల్ మతస్థులో అయి ఉన్నారు. కొంచెముమంది రోమను కేథలిక్కు మతస్థులున్ను, యూదులున్ను కూడా ఉన్నారు. మొత్తము జనసంఖ్యలో రోమను కేథొలిక్కులు నూటికి 30

మందిన్ని, యూదులు నూటికి 0.3 మందిన్ని ఉం టారు. వీరిద్దరికిన్ని ప్రత్యేకముగా బడులున్నవి. వీటిలో ఆయామతస్థులే ఉపాధ్యాయులుగా ఉం టారు. వీటికయ్యే ఖర్చుఅంతా మూలప్రభు త్వమే భరిస్తుంది. రోమనుకాథొలిక్కులకు తమ బోధనాభ్యసన కళాశాలలున్నవి, కాని యూదు లకులేవు. యూదులు కొంచెముమందే ఉండడ మున్నూ, వారున్నూ అక్కడక్కడ చెదిరి ఉండడ మున్నూ, దీనికి కారణములు. చిన్న పట్టణాలలో ప్రత్యేకముగా వీరికి బడులు పెట్టడానికి చాలినంత మంది విద్యార్థులు లేకపోవడముచేత వీరి పిల్లలను ప్రొటెస్టాంటు బడులలోనే చేర్చుకొంటారు. మొత్తముమీద జర్మనీదేశములో ప్రొటెస్టాంటు బడులలో చదువుకొనే రోమనుకాథొలిక్కు పిల్లలు నూటికి 1.7 మందిన్ని, యూదులపిల్లలు నూటికి 0.4 మందిన్ని ఉన్నారు. రోమను కాథొలిక్కు బడులలో ప్రొటెస్టాంటు పిల్లలు నూటికి 0.8 మందిన్ని, యూదులపిల్లలు నూటికి 0.1 మందిన్ని ఉన్నారు. తరగతి ఉపాధ్యాయుడే మతవిద్య

చెప్పుతారు; కాని, అతనికి ఇష్టములేకపోతే, నేను చెప్పనని నిరాకరించవచ్చును. అయినా అనుభవములో అట్లు నిరాకరించడము అరుదుగా ఉన్నది. తల్లిదండ్రులు ఈ మతవిద్యాపాఠములకు తమపిల్లలను పంపకపోవడానికిన్ని, అదేబడిలో బడివేళలో కాక పురోహితుడు ఆ మత మత విద్యను చెప్పించడానికిన్ని హక్కుగలదు. మత విద్య సామాన్యముగానే ఉంటుందిగాని, ఇట్లు నమ్మవలెను, ఇట్లు నమ్మకూడదు, అని ఉండదు. సాధారణముగా బైబిలుకథలున్ను, చర్చిచరిత్రమున్ను చెప్పుతారు. యుద్ధమయిన తరువాత సోషలిష్టు ప్రభుత్వమువారు బడులలోనుంచి మత విద్యను కేవలము తీసివేయడానికి ప్రయత్నించినారు బవేరియారాష్ట్రములో సిముల్టన్‌షూలె (Simultan schule) అనే మిశ్రముపాఠశాలలను ఏర్పాటుచేసినారు. ఇవి క్రొత్తమోస్తరు బడులు. వీటిలోనికి ఏమతమువారినైనా చేర్చుకొంటారు. అన్నివిషయాలున్ను అందరికీ సామాన్యముగానే నేర్పుతారుగాని, మతమునకుమాత్రము ప్రత్యేక

ముగా ఉపాధ్యాయు డుంటాడు. కేథొలిక్కు-
పిల్లలను బడులలో కేథొలిక్కు పురోహితుడు
బోధిస్తాడు. యూదుపిల్లలను ఆస్థలములో వారి
పురోహితుడైన "రబ్బీ" ఉంటే, అతనికిన్నీ, ప్రో
టెస్టాంటుపిల్లలను ఆస్థలములోని ప్రొటెస్టాంటు
పురోహితునికిన్నీ ఒప్పచెప్పతారు. బడి పెద్ద
దయితే, బడిలోనే ఎల్లకాలమున్నూ పనిచేయడా
నికిఒకనిని నియమిస్తారు. మతేతర విషయాలను
బోధించడానికి వారివారి మతములతో నిమిత్తము
లేదు.

ఈ ఏర్పాటును కేథొలిక్కు పురోహితులు
ఒప్పకోక, ఈసిమల్టెక్ స్కూలెను గర్హించి, పిల్ల
లను ఆబడులలోనుంచి తీసివేయవలసినదని తల్లి
దండ్రుల కుద్బోధము చేయడము ప్రారంభించి
నారు. ఈబడులు మతమును పోషించేవి కావ
నిన్నీ, వాటిలో భూగోళశాస్త్రము, చిత్రలేఖ
నము, సంగీతము, మొదలయిన విషయాలను రో-
మను కేథొలిక్కు మతము ప్రకారము నేర్పలేద
నిన్నీ, వీరి ఆక్షేపణము. 1922 సం॥రము జనవరి

నెలలో జరిగిన చర్చలో, ఒక కేథొలిక్కు సభ్యుడు గణితమును రోమను కేథొలిక్కు మతము ప్రకా రము నేర్పవలసినదని చెప్పగా, హెర్ హిఫ్‌మాన్ అనే కమ్యూనిస్టు సభ్యుడు మతవిద్యయే కూడదని వెక్కిరిస్తూ గొప్ప ఉపన్యాసము చేసినాడు. ఈ చర్చనుబట్టిన్ని, ఇతర చర్చలను బట్టిన్ని, బడులలో మతవిద్య నిర్బంధముగా నిలిచిఉన్నది. కాని, బైబిలు బోధనము, బైబిలుకథలు, చర్చిచరిత్రము లను మాత్రమే నేర్పుతారు. ఏమినమ్మవలెను, అనే విషయమును బోధించరు. ఇప్పుడు సాధా రణ విషయాలను బోధించే ఉపాధ్యాయులే మత మునుకూడా బోధిస్తారు. మతవిద్యలేని బడులు కూడా ఉన్నవి. వీటి ఖర్చుకూడా మూలప్రభు త్వమువారే భరిస్తారు.

బడుల తనిఖీ

"గెమెండె"లకున్ను "స్టాడ్‌టు" లకున్ను ఒకొక్క మండలమునకు ఒకొక్క ఇన్స్పెక్టరును విద్యాంగమంత్రి నియమిస్తాడు. అతను సంవత్సర మున కొకసారి అయినా బడులను తనిఖీ చేయు

వలెను. అతను ఉపాధ్యాయ సభలను కూర్చి, ఆయావిషయాలలో సరిక్రొత్త బోధనపద్ధతులను గురించి తెలుపుతాడు. తన మండలములోగాని, దగ్గరగల మరిఒక మండలములోగాని విద్యావిషయమై జరుగుతూఉన్న పరిశోధనలను చూడడానికి ఉపాధ్యాయులను పిలుచుకపోతాడు. ఉపాధ్యాయులకు మంచి సలహాలివ్వడానికి అతను బడులను తనిఖీ చేస్తాడుకాని, వారిదోషములను మాత్రము చూపడానికికాదు. అతడు ఉపాధ్యాయుల తప్పులను గురించి రిపోర్టుచేయడు. దానికి బదులుగా తానే ఒకతరగతికి తీసుకొని ఏలాగు పాఠములు చెప్పవలెనో స్వయముగా చూపుతాడు. తన క్రిందివారి దోషాలను రిపోర్టులో చూపడము సులభమేకాని, మంచి బోధనపద్ధతిని స్వయముగా అవలంబించి చూపడము కష్టముగదా!

### వెర్సోర్ గుంగ్ పష్ట్. (శిశుపోషణశాఖ)

ఐరోపాఖండములోని అన్ని దేశాలలోను మ్యునిసిపాలిటీలలోను, జిల్లాబోర్డులలోను, శిశుపోషణశాఖ లున్నవి. కాని, ఆశాఖలు జర్మనీదేశ

ములో మంచి పద్ధతులమీద నడుస్తున్నవి. ప్రతి మ్యునిసిపాలిటీలోను శిశుపోషణశాఖ ఉంటుంది. ఇంగ్లాండులో ఈపని ప్రభుత్వమువారుకాక, ప్రయివేటు సంఘములవారు చేస్తారు. శిశువు పుట్టగానే ఆసంగతి మ్యునిసిపాలిటీవారికి తెలియజేయవలెను. వెంటనే ఒక మ్యునిసిపలు దాదివచ్చి తలిదండ్రులు శిశువుకు సమకూర్చలేని సదుపాయములన్ని చేస్తుంది. శిశువు అనాథఅయినా తలిదండ్రులు దానిని సరిగాచూడక హింసించినా, సరిఅయిన ఆహారము, దుస్తులు లేకపోయినా, వెంటనే ఆశిశువును ఒక శిశుపోషణ గృహమునకు (Nursing Home) పంపుతారు. ఈ శిశుపోషణ గృహములలోని పిల్లలను దగ్గరగాఉన్న కిండర్ గార్టెన్ బడులకో, ప్రారంభ పాఠశాలలకో పంపుతారు. ఆపిల్లతండ్రి బ్రతికిఉంటే, ఆశిశువు పోషణమునకు అతడుకొంతసొమ్ము ఇచ్చుకోవలెను. ఈ శాఖవారు ప్రారంభపాఠశాలలలోని పిల్లల శ్రేయస్సునుకూడా గమనిస్తూ ఉంటారు. బడికాలములో పిల్లలకు ఉచితముగా తిండిపెట్టడమే కా-

కుండా, కొన్ని సమయాలలో పుస్తకాలు, బట్టలు కూడా ఇస్తారు. పేదపిల్లలకు ఉచితముగా వైద్యమున్ను చేస్తారు.



## అధ్యాయము 2.

### పల్లెటూరి బడులు. (ఫార్ షూలె)

యుద్ధసమయమున జర్మనీలో వ్యవసాయము చాలా అభివృద్ధి చెందినది. పూర్వము పశువుల మేతకు వదలిపెట్టినభూమి ఇప్పుడు సాగులోనికి వచ్చినది. చాలాకాలమువరకు జర్మనులు తమ దేశములో పండే పంటలమీదనే బ్రతకవలసి వచ్చినది. అందుచేత వ్యవసాయమును గురించి శాస్త్రీయపద్ధతుల ప్రకారము పరిశోధనలుచేసి, ఆశాస్త్రజ్ఞానమును పండ్లు, కూరగాయలు, ధాన్యములు, ఎక్కువగా మునుపటికంటె బాగుగా ఏలాగు పండించడమో అనే విషయమునకు వినియోగించినారు. ఇంగ్లాండులో వ్యవసాయము వల్ల అంతలాభములేదు. గనుక, వారు పాల

ములను పశువుల చేత బీళ్ళుగా మార్చుకొంటారు. అందుచేత పల్లెటూళ్ళ జనము క్రమక్రమముగా పట్టణాలలోనికి వచ్చేస్తున్నారు. కాని, జర్మనీలో అట్లుకాదు. జర్మనులకు వ్యవసాయము లాభకరముగా ఉన్నది. వ్యవసాయదారులకు తమపనికి అంటిపెట్టుకొని ఉండడమే ఇష్టము. పూర్వము జంతువులనుంచి మాత్రమే తయారయ్యే చాలా వస్తువులను జర్మనులు వృక్షములనుంచి కూడా తయారుచేయడము నేర్చుకొన్నారు. అందుచేత వారు అడవులను పెంచడములో ఎక్కువ శ్రద్ధ వహించి, ఎంతో అభివృద్ధి పొందినారు. అనేక జర్మను విశ్వవిద్యాలయాలలో అడవి శాఖలను ఏర్పాటు చేసినారు. ప్రత్యేక వ్యవసాయకళాశాలలను అభివృద్ధి చేసుకొన్నారు. పరిశోధనముల కోసము లెక్కలేనన్ని పొలములు లేచినవి. ఆ రేసి గ్రామములకు ఒకొక్క పరిశోధన క్షేత్రమున్నది. జర్మనీలో కొన్ని పల్లెటూళ్ళు కలసి ఒక గెమెండె అను పేరు కలిగిఉంటవి. ఒకొక్క మండలమునకు ఒకొక్క స్కూళ్ళ ఇన్స్పెక్టరు ఉంటాడు. ఆ

మండలములోని పల్లెటూరి బడులన్నీ అతని పరి పాలనములో ఉంటవి. ఒకానొక మండలములో 75 పల్లెటూళ్ళున్నవి. వాటిలో జనసంఖ్య 40000 ఉన్నది. వీటిలో ప్రతిపల్లెటూరికి ఒకబడి ఉన్నది. ఈబడులలో నిర్బంధముగా వయస్సు పధ్నాలు గేండ్లవరకు చదువుచెప్పుతారు. కొన్ని బడులలో ఒకొక్క తరగతికి, ఒక్కడే ఉపాధ్యాయుడు ఉంటాడు. పిల్లలసంఖ్య అరవైకి పైబడితే మరి ఒక ఉపాధ్యాయుడిని నియమించవచ్చును. ప్రస్తు తము పిల్లలసంఖ్య ఎక్కువగానే ఉన్నదికాని, ధన లోపముచేత అంతకంటె తక్కువమంది పిల్లలకు ఒక ఉపాధ్యాయుడిని ఏర్పాటుచేయడానికి వీలు లేకున్నది. (కొన్నిదేశాలలో, ఒక్కడే ఉపా ధ్యాయుడుండే బడులలోని పిల్లలను రెండుతండా లుగా విభాగించి, ఒకతండావారికి సోమ, బుధ, శుక్రవారములలోను, రెండోతండావారికి మంగళ, గురు, శనివారములలోనున్ను చదువుచెప్పుతారు.) జర్మనీలో ఒకబడిలో 62 పిల్లలుకూడా ఉన్నారు. ఒకొక్క మండలమునకు ముగ్గురువైద్యులున్ను,

ఇద్దరు దంతవైద్యులున్నూ ఉంటారు. వీరు నెల కొకసారి ప్రతిబడికి పోయి తనిఖీచేస్తారు. బడిలో ప్రవేశించేటప్పుడు, ప్రతివిద్యార్థినిన్ని వైద్యుడు సంపూర్ణముగా తనిఖీచేసి, ఒకఫారములో తాను పరీక్షించిన విషయాలన్నిటినీ వ్రాసి ఉంచుతాడు.

వైద్యుడు ప్రతిబడినీ నెలకొకసారిఅయినా పరీక్షించి, రోగములుగాని అంగవైకల్యముగాని గల పిల్లలను "హిల్ఫ్‌షూలె" (Hilf schule)అనే ప్రత్యేక విద్యాలయానికి పంపుతాడు. గుడ్డి, చెవుడు, మూగ పిల్లలకున్నూ, రోగిష్ఠి పిల్లలకున్నూ, మందమతులకున్నూ, ప్రత్యేక పాఠశాల లున్నవి. ఈపాఠశాలలలో పూర్వము నిర్బంధపాఠక్రమము లేకుండెను గాని, 1924 సం॥ములో ఒకొక్కరీతి బడికి ఒకొక్కరీతి పాఠక్రమమును విద్యాంగమంత్రి ఏర్పాటుచేసినాడు. ఈ బడులలో పిల్లలు ఎట్లు అభివృద్ధి పొందుతున్నారో జాగ్రతగ కనిపెట్టుతూ ఉంటారు. జర్మనీదేశములో మందమతులైన పిల్లలకోసమే కాకుండా అసాధారణప్రజ్ఞగల పిల్లలకు కూడా ప్రత్యేకవిద్యాలయము లున్నవి.

ఈ పల్లెటూరిబడుల ముఖ్యలక్షణము, వా-టిలో నేర్పేవిషయములు కాదు. ఆయా విషయాలను నేర్పే పద్ధతియే గమనింపదగినది. ఉదాహరణానికి, అన్నిబడులలోను గణితము నేర్పుతారు గాని ఒకొక్క రీతిబడిలో ఒకొక్క తీరు లెక్కలు చెప్పుతారు. ఒకొక్క రీతి బడికి ప్రత్యేకముగా పఠనీయగ్రంథాలు వ్రాస్తారు. ఏవో ప్రాత విషయాలమీదను, జీవితానికి అవసరము లేని విషయాలమీదను కాలము వృథా చేయరు. పిల్లల నిత్యజీవనానికి సంబాధించిన కొన్ని విషయాలను ప్రత్యేకించి, వాటిని గురించ మాత్రమే చెప్పుతారు. ఉదాహరణానికి, పొలములను స్వయముగా కొలిపించి, విత్తులఖరీదును, పండిన పంట ఖరీదును పిల్లలచేత కట్టిస్తారు. ఇట్లే, ఇతర విషయాలలో కూడాను. చిత్రలేఖనము, చరిత్రము, భూగోళశాస్త్రము, వాచకపుస్తకాలు, ఇవన్నీ గ్రామజీవనముమీద పిల్లలదృష్టి నిలిచేటట్లు చేస్తవి. ఈపల్లెటూరిబడుల ఉపాధ్యాయులను ఆ మట్టుపట్ల వారినే నియమిస్తారు. వారికి ఆయాగ్రామాల

పరిస్థితులు తెలిసిఉంటవి. ప్రతిబడికిన్ని ఒక పెద్ద తోట ఉంటుంది. ఒకొక్క పిల్లవాడు సాగుచేయ డానికి కొంతస్థలము ఏర్పాటుచేస్తారు. వాడు తానొక్కడేకాని, ఇతరులతో కలిసికాని, దానిని సాగుచేస్తాడు. తన స్థలములో పండించుకొన్న దానిని పిల్లవాడు ఇంటికి తీసుకొని పోవచ్చును. ఇంగ్లాండులోని కొన్ని పల్లెటూరిబడులలో కొన్ని సంఘములవారు కలిసి భూములను సాగుచేసే పద్ధతి జర్మనీలో లేదు.

ఉపాధ్యాయుడు పిల్లలను వారమున కొక తూరి పరిశోధన క్షేత్రములకు తీసుకొనిపోయి, వ్యవసాయశాస్త్రములో సరికొ్రత్తగా కనిపెట్ట బడిన విషయాలను పిల్లలకు బోధచేస్తాడు. బడు లలో వ్యవసాయము విషయమై సామాన్యోప- న్యాసము లిస్తారు. వీటిని పిల్లల తలిదండ్రులు కూడావచ్చి వినవచ్చును. పల్లెటూరి ప్రారంభ పాఠశాలలలో వ్యవసాయమును ప్రత్యేకవిషయ ముగా చెప్పరుగాని, విద్య వ్యవసాయముదారినే పట్టి ఉంటుంది. పాఠ్యపుస్తకనిర్ణయము, ఉపాధ్యా

యులు చెప్పే చదువుబడులలో చేసే వ్యవసాయము, వ్యవసాయక్షేత్రములకు తరుచుగా పోయిచూడడము, వ్యవసాయము, పండ్లచెట్లకృషి మొదలయిన విషయములగురించి ఉపన్యాసాలు, ఇటువంటివాటిచేత ఈపాఠశాలలలోని విద్య వ్యవసాయరీతినే అవలంబిస్తుంది. వ్యవసాయవిషయములను గురించిన శాసనములనుకూడా పిల్లలకు బోధిస్తారు. కోతలకాలములో పల్లెటూరిబడులకు ఎక్కువ సెలవులిస్తారు.

పద్నాలుగేండ్ల వయస్సుతో పిల్లలకు నిర్బంధవిద్య అయిపోతుంది. అప్పుడువారు పొలాలమీద పనిచేసుకొంటారు. ఇదే వారివ్యవసాయవిద్యకు ప్రారంభ మనుకోవచ్చును. దేశశాసనము ప్రకారము ప్రతిబాలుడున్ను బాలికయున్ను మరిరెండేళ్ళు ఉన్నతగ్రామపాఠశాలలలో (డోర్ఫ్ ఫోక్ హాక్ షూలె (Dorf Volkhoch schu'e) చదువుకోవలెను. ఈబడులలో (1) జర్మనుభాష (2) గణితము (3) క్షేత్రగణితము (4) చిత్రలేఖనము (5) చరిత్రము, అనుభవశాస్త్రము (6) భూ

గోళశాస్త్రము (7) కసరత్తు (8) గాత్రసంగీతము (9) పదార్థ విజ్ఞానశాస్త్రము (10) సాధారణ, విశేష వృక్షపోషణము (11) రసాయనశాస్త్రము (12) మొక్కలను గురించిన శాస్త్రము (13) జంతుశాస్త్రము (14) కూరగాయలు, పండ్లు పండించడము (15) చిత్రా ఆవర్జాలువ్రాయడము (16) జంతువుల గురించినబోధన— అనే విషయాలను నేర్పుతారు. ప్రతి విద్యార్థిన్ని (1) సాధారణ వ్యవసాయము (2) తోటలుపెంచడము, లేక (3) కూరగాయలు, పండ్లు పండించడము, అనే విషయాలలో విశేష జ్ఞానమును సంపాదించవలెను. చలికాలములో వ్యవసాయపు పను లెక్కువగా ఉండవుగనుక, ఈబడులు సాధారణముగా చలికాలములో ఉంటవి. ఈ బడులను డెన్మార్కుదేశములోని పల్లెటూళ్ళబడుల మాదిరిగా జర్మనులు ఏర్పాటు చేసుకొన్నారు. కాని, వాటికీ వీటికీ కొన్ని ముఖ్యభేదము లున్నవి.

(1) జర్మనీలో ఈబడులలో పిల్లలు నిర్బంధముగా చదువుకోవలెను. డెన్మార్కులో ఇచ్ఛ

కము, నిర్బంధము లేదు.

(2) డెన్మార్కులో ఈబడులు వసతిగృహాములుగా ఉంటవి. జర్మనీలో ఇవి పగటిబడులు మాత్రమై ఉంటవి.

(3) డెన్మార్కులో విద్య వ్యవసాయవాసనగలిగి ఉంటుంది. జర్మనీలో వ్యవసాయమును ఎక్కువగా నేర్పుతారు.

ఈ బడులు డెన్మార్కులోకంటె జర్మనీలో ఎక్కువగా ఉన్నవి. 75 పల్లెటూళ్ళకు ఇటువంటి బడులు 36 ఉన్నవి. 2½ చదరపు మైళ్ళకు ఒక బడి ఉన్నది. ఈ బడులు పరిశోధనక్షేత్రములకు అనుబంధములుగా ఉంటవి.

---

# అధ్యాయము ౮.

## ఉన్నత విద్య.

### జిమ్నేసియుమ్ (Gymnasium), రియల్ జిమ్నేసియుమ్ (Real Gymnasium), ఓబర్ రియల్ షూలె (Ober Real schule), ఔఫ్‌బౌ షూలె (Aufbau schule).

జర్మనీలో పిల్లలందరున్ను సామాన్య విద్యాలయాలలో నాలుగేళ్ళు మొట్టమొదట నిర్బంధముగా చదువవలెనని మూడో అధ్యాయములో తెలుపబడ్డది. ఉన్నత పాఠశాలలలోనికి పిల్లలను పదేళ్ళ వయస్సున చేర్చుకొంటారు ఇక్కడ వారు తొమ్మిదేళ్ళు చదువుకోవలెను. ఈ క్లాసులకు వరుసగా సెక్స్టా (Sexta) క్విన్టా (Quinta) క్వార్టా (Quarta), ఉంటర్ టెర్షియా (Unter tertia), ఓబర్ టెర్షియా (Ober tertia), ఉంటర్ సెకుండా (Unter sekunda), ఓబర్ సెకుండా (Ober secunda), ఉంటర్ ప్రైమా (Unter prima), ఓబర్ ప్రైమా (Ober prima) అని పేళ్ళు. విద్యార్థుల మొత్తము సంఖ్యలో నూటికి

12 మంది ఈ ఉన్నతపాఠశాలలలో చేరుతారు. పట్టణాలలో ఈసంఖ్య ఎక్కువగా ఉంటుంది. ఒక పట్టణ సాధారణ పాఠశాలలో నూటికి 30 మంది ఉన్నతపాఠశాలలో చేర నిశ్చయించుకొన్నారట. ఈ ఉన్నత పాఠశాలలసంఖ్య 2,400; ఇందులోని విద్యార్థులసంఖ్య 8,00,000. పెద్ద ఉన్నత పాఠశాలలో 800 మంది పిల్లలుంటారు. ఉపాధ్యాయులసంఖ్య 42,561; వీరిలో నాలుగోవంతు మంది ఆడవాళ్ళు. ఉన్నత పాఠశాలలు నాలుగు విధములుగా ఉంటవి.

(1) జిమ్నేసియములు (Gymnasiums): ఇవి పురాతన పద్ధతుల ననుసరించేవి. వీటిలో లాటిను, గ్రీకు, అనే ప్రాచీనభాషలను నిర్బంధముగా నేర్పుతారు. ఇప్పుడు ఫ్రెంచిభాషకంటె, ఇంగ్లీషును ఎక్కువగా చెప్పుతున్నారు.

(2) రియల్ జిమ్నేసియమ్ (Real Gymnasium): ఈబడులలో గ్రీకుభాష నేర్పరు గాని, లాటినుభాష నిర్బంధము. గ్రీకు భాషకు బదులుగా ఇప్పటి యూరోపియను భాషలను నేర్పు

తారు. ఇవిగాక వృక్షశాస్త్రమును, జాతుశాస్త్రమును బోధిస్తారు.

(3) ఓబర్-రియల్ షూలె (Ober-real schule): ఈబడులలో నవీనశాస్త్రములు ఎక్కువగా నేర్పుతారు. లాటిను, గ్రీకుభాషలకు బదులుగా గణితము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, జీవశాస్త్రములను విశేషముగా బోధిస్తారు.

ఓబర్-ప్రైమా (Ober-prima) అనే మీాదిక్లాసులో వారమునకు ఈ మూడువిధములైన బడులలోను నేర్పే విషయాలనున్ను, క్రొత్తరకము బడులయిన "రిఫార్మ్డ్ జిమ్నేసియమ్" (Reformed Gymnasium) అనే బడులలోను అమలులో ఉన్న పాఠక్రమము ఈ క్రింద చూపబడినది—

| విషయములు. | | జిమ్నేషియం | రియల్ జిమ్నేషియం | ఓబర్ రియల్ షూలె | రిఫార్మ్ జిమ్నేషియం |
|---|---|---|---|---|---|
| 1. మతము | ... | 2 | 2 | 2 | 2 |
| 2. జర్మను భాష | ... | 3 | 3 | 4 | 3 |
| 3. లాటిను భాష | ... | 5 | 3 | లేదు | 4 |
| 4. గ్రీకు భాష | ... | 6 | లేదు | లేదు | లేదు |
| 5. ప్రస్తుత యూరోపి యను భాష | .. | లేదు | 4 | 3 | 3 |
| 6 రెండో ప్రస్తుత యూరోపియను భాష | ... | లేదు | 4 | 3 | 3 |
| 7. చరిత్రము, పౌరత్వము | ... | 3 | 3 | 3 | 3 |
| 8. భూగోళశాస్త్రము | ... | 1 | 1 | 1 | 1 |
| 9. గణితము | ... | 4 | 4 | 5 | 4 |
| 10. శాస్త్రము | ... | 2 | 4 | 6 | 3 |
| 11. చిత్రలేఖనము | ... | 1 | 2 | 2 | 2 |
| 12. కసరత్తు, కవాతు | ... | 2 | 2 | 2 | 2 |

సంగీతమున్ను, ఇటాలియను, స్పానిషు, రషియను, మొదలయిన యూరోపియను భాషలున్ను ఐచ్ఛికములు.

(4) ఔఫ్‌బౌ షూలె (Aufbou schule):

యుద్ధము ముగిసినతరువాత, జీతము చెల్లించుకొనగలిగినవారికే ఉన్నతవిద్య అనే అభిప్రాయము మారిపోయినది. దాని ప్రకారము ఈ బడులు ఏర్పాటయినవి, ఇవి ప్రాన్సు దేశములోని కళాశాలలకు సరిపోతవి. పేదపిల్లలలో చాలా మందికి జీతములేకుండానే విద్యను బోధించే సదుపాయములు ఈబడులలో చేయబడ్డవి. ఈ బడులలో ప్రత్యేక పాఠక్రమము లేదు. వీటిలో రియల్-జిమ్నేసియము బడులలో చెప్పే విషయములున్ను ఓబర్-రియల్ షూలె బడులలో చెప్పే విషయములున్ను, ఎవరికి కావలసినవి వారికి ప్రత్యేకముగా చెప్పుతారు.

ఇంకా బీదవారికోసము, పగటిపూట కర్మాగారాలలో పనిచేసుకొనివచ్చి చదువుకొనడానికి సాయంకాల ఉన్నత పాఠశాలలుకూడా (Evening High Schools) ఉన్నవి. ఇంతకు పూర్వము ఉపాధ్యాయులే మెట్రిక్యులేషను పరీక్షను చేస్తూ ఉండడముచేత ప్రయివేటుగా ఆపరీక్షను ప్యాసు కావడమునకు అవకాశము లేకుండేది. ఇప్పుడు

దానికి ప్రియివేటుపరీక్షకూడా ఏర్పాటుచేసినారు. దీనిని విద్యామంత్రిశాఖవారు చేస్తారు. ఈ పరీక్ష ప్రతిశనివారమున్ను జరుగుతుంది. దీనికి "తెలివి పరీక్ష" (Intelligence Test) అని పేరు. ఈపరీక్షలో కృతార్థులయినవారు ఒక విశ్వవిద్యాలయములో చేరవచ్చును.

మెట్రిక్యులేషను పరీక్షకు అబిట్యూరియెంటెన్ ఎక్జామెన్ (Abituiienten Examen) అని పేరు. ఈపరీక్ష ఎట్లుజరుగుతుందో మరొక అధ్యాయములో చెప్పబడ్డది. పదమూడేళ్ళ చదువులో ఈ 'తెలివి పరీక్ష' (Intelligence Test) తప్ప మరేదిన్ని ప్రియివేటుపరీక్ష లేదు. ప్రతి దినమున్ను విద్యార్థులుచూపిన అభివృద్ధిని బట్టిన్ని, తరగతి ఉపాధ్యాయుల రిపోర్టులను బట్టిన్ని పిల్లలను పైక్లాసులలో వేస్తారు.

ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశములలోవలె కాక, జర్మనీదేశపు ఉన్నత పాఠశాలలన్నీ పగటిపూట ఉండేవే. పై స్థలములనుంచి వచ్చే విద్యార్థులు గదులను అద్దెలకు తీసుకొని, భోజన సదుపాయా

లను తామే చేసుకొంటారు. కొన్ని స్థలాలలో ఉపాధ్యాయులు సొమ్ముపుచ్చుకొని విద్యార్థులకు అన్నము పెట్టుతారు. కొన్ని ప్రయివేటు స్కూళ్ళుమాత్రము ఇంగ్లీషు వసతి గృహములు మోస్తరుగా ఉంటవి. ఇవి కేవలము ప్రయివేటు బడులే; వీటికి ప్రభుత్వమువారు గ్రాంటులిస్తారు. ఇంగ్లాండులోవలె వసతి గృహములతో కూడిన పాఠశాలలు లేకపోవడముచేతనే యుద్ధములో తామోడిపోయినామని జర్మనుల అభిప్రాయము. ఇంగ్లీషు పబ్లికుస్కూళ్ళలో విద్యాపద్ధతులను తెలుసుకొనడానికి చాలమంది జర్మను విద్యానుభవజ్ఞులు పోయినారుగాని, అవి చాలా డబ్బుఖర్చుతో కూడినవని అట్టిస్కూళ్ళను తమ దేశములో ఏర్పాటు చేయవలెననే అభిప్రాయమును వదలుకొన్నారు. విద్యామంత్రిశాఖవారే ఆయావిధముల ఉన్నత పాఠశాలలకు తగినట్లు పాఠక్రమములను వ్రాసి, ఏవిషయము ఎన్ని గంటలు చెప్పవలెనో నిర్ణయిస్తారు. జర్మనుభాషా వాచకపుస్తకములు ఇతర యూరోపియను భాషా

వాచక పుస్తకములు తప్ప, తక్కిన అన్ని విషయాలను బోధించడము ఉపాధ్యాయులకే వదలిపెట్టుతారు. నిర్బంధవిషయాలను నేర్చుకొనడానికి వారమునకు 30 నుంచి 33 గంటలున్నూ, ఐచ్ఛిక విషయాలకు వారమునకు 15 గంటలున్నూ ఉంటవి. బడులు ఉదయము 5-30 గంటలున్నూ మధ్యాహ్నము 2 గంటలున్నూ పనిచేస్తవి. సంగీతము, చేతిపనులు, ఐచ్ఛికవిషయములే అయినా సాధారణముగా అందరు పిల్లలున్నూ వాటిని తీసుకొంటారు.

ప్రతి ఉపాధ్యాయునికిన్ని వారమునకు 25 గంటలు పని ఉంటుంది. ఏదో ఒక్కవిషయమే కాక ఎక్కువ విషయాలనుకూడా వారు బోధించవలసిఉంటుంది. విశ్వవిద్యాలయాలలో తప్ప క్రింది బడులలో ఉపాధ్యాయు డేదో తన అభిమాన విషయములో పాఠము చెప్పవలెననే నియమములేదు. ఒకొక్క పీరియడ్డు 55 నిమిషము లుంటుంది. ఒకక్లాసులోనుంచి మరిఒక క్లాసులోనికి పోవడానికి 5 నిమిషములు గడవుంటుంది. ఆటలకోసమని కొన్ని పీరియడ్డులు 45 నిమిషాలే ఉంటవి.

# అధ్యాయము ౯.

## జర్మనీలోని ఒక మంచి ఉన్నతపాఠశాల వర్ణనము.

(గోటింజన్ పట్టణములోని ఓబర్ - రియల్ షూలె.)

ఈబడిలో రియల్-జిమ్నేసియమ్ బడిలోని పాఠక్రమమున్ను, ఓబర్-రియల్ షూలె లోని పాఠక్రమమున్ను ప్రత్యేక ప్రత్యేక తరగతులలో నేర్పుతారు. ఇందులో 650 విద్యార్థులున్నారు. 23 ప్రత్యేకక్లాసు లున్నవి. ఉపాధ్యాయుల సంఖ్య 30; అందుచేత 20 మంది విద్యార్థుల కొక ఉపాధ్యాయు డున్నాడన్నమాట. క్రింది తరగతులలో ఒకొక్కదానిలో 50 మంది విద్యార్థులున్నారు. బడికయ్యే మొత్తముఖర్చు 12500 పౌనులు. దీనిలో ఇంచుమించు సగము విద్యార్థుల జీతములవల్ల వస్తుంది. ఉపాధ్యాయుల జీతాలు సంవత్సరమునకు 250 పౌనులనుంచి 500 పౌనులవరకు ఉన్నవి. ప్రధానోపాధ్యాయునికి డైరెక్టరనిపేరు. ఇతనికి ప్రత్యేకముగా ఎక్కువ జీతములేదు. సాధారణ ఉపాధ్యాయుని జీతమే అతనికిన్ని ఇస్తారు. డైరక్టరుపనిని చూడడానికి

సంవత్సరానికి 60 పౌనులుమాత్రము ఎక్కువగా ఇస్తారు. విద్యార్థులలో నూటికి 20మందికి ఉచితముగా చదువు చెప్పుతున్నారు. తల్లిదండ్రుల మొదటి కొడుకుకుగాని కూతురుకుగాని నిండుజీతము చెల్లించవలెననిన్ని, రెండోకొడుకు లేక కూతురికి నిండుజీతములో $\frac{3}{4}$ వంతున్ను, మూడోకొడుకు లేక కూతురికి సగమున్ను చెల్లించవలెననిన్ని, తరువాతి కొడుకులకు, కూతుళ్ళకు జీతముచెల్లించనక్కరలేదనిన్ని, జర్మనీలో ఒకపద్ధతి ఉన్నది. ఒక్క తల్లిదండ్రుల పిల్లలందరున్ను ఒకేబడిలో చదువుకో నక్కరలేదు. పిల్లలు వేర్వేరుగా విశ్వవిద్యాలయాలు, వృత్తికళాశాలలు, ఉన్నత పాఠశాలలలో చదువుకొంటూ ఉన్నా, ఇదేపద్ధతిగా జీతాలు ఇవ్వవలసిఉంటుంది. ఇప్పుడు వర్ణిస్తూ ఉన్న బడిని దానికోసముకట్టిన భవనములోనికి మార్చినారు. దానిలోని వసతి, దానిఆకారము దానిలోని విద్యాసాధనసామగ్రి, అంతా మిక్కిలి నవీనపద్ధతులమీాద ఉన్నది. ప్రతిగదికిన్ని విద్యుచ్ఛక్తిచేత నడిచే గడియారమున్నది. ఈ గడి

యారా లన్నిటికీ మూలమైన గడియారములోని వేళను నక్షత్రపరిశోధన శాలలోని గడియారము ప్రకారము సరిచేస్తూ ఉంటారు. తల్లిగడియారముఖరీదు 30 పౌనులు, పిల్లగడియారముల దయాలు 1-కి 2 పౌనులు ఖరీదు. అన్నీ ఏకకాలమందు ఒకటే వేళను చూపుతవి.

ఈబడిలోచెప్పే విషయాలలో శాస్త్రము, గణితము విశేషములు. శాస్త్రవిద్య అనుభవము మీాద ఎక్కువ ఆధారపడి ఉంటుంది, పుస్తకాల విద్య తక్కువ. పిల్లలు క్లాసులలోకంటె పరిశోధనాగారాలలో ఎక్కువకాల ముంటారు. ప్రతి విద్యార్థికిన్ని ప్రత్యేకముగా ఒకటేబిలు విద్యుత్ప్రవాహము, గేసు, నీటిగొట్టములు, ఉంటవి. ఈటేబిలుమీాద విద్యార్థి తనపుస్తకాలు, కాగితాలు ఉంచుకొని తన పరిశోధనలను చేసుకోవచ్చును. విద్యార్థులు ఉపాధ్యాయులుచేసే పరిశోధనలను చూడడమే కాకుండా, తాముకూడా చేస్తూ ఉంటారు. భూగోళశాస్త్రపాఠాలలోకూడా ఇదేపద్ధతి అవలంబిస్తారు. ప్రతి విద్యార్థికిన్ని

తన టేబిలుమీద చిన్న దేశపటముంటుంది.

గణితమును ప్రొఫెసరు క్లీను ఏర్పాటుచేసిన క్రొత్తపద్ధతి ప్రకారము నేర్పుతారు. ఈబడి డైరెక్టరు క్లీనుశిష్యుడు. గణితములో గొప్ప పేరు గడించినవాడు. ఇంగ్లీషు, ఫ్రెంచిబడులలో జీవశాస్త్రము నంతబాగుగా చెప్పరు. జర్మను పాఠశాలలలో ఇండియాలోని అత్యుత్తమ కళాశాలలోకంటె మంచినైన జీవశాస్త్రపు పరిశోధనాలయములు, వస్తుప్రదర్శనశాలలు, తోటలును, ఉన్నవి. ఇటువంటి సౌకర్యములు లేకపోవడము చేతనే ఇంగ్లీషు విశ్వవిద్యాలయాలలో విద్యార్థులు సాధారణముగా జీవశాస్త్రమును అభిమాన విషయముగా తీసుకోరు.

యుద్ధము ముగిసినతరువాత, ఆటలు, వ్యాయామక్రీడల గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకొంటున్నారు. ఈబడిలో ఉర్నహాల్ అనబడే మిక్కిలి నవీన పద్ధతులమీద ఒక వ్యాయామరంగమును నిర్మించినారు. వ్యాయామము కాగానే పిల్లలు వేడినీళ్ళతోనో, చన్నీళ్ళతోనో స్నానము చేయ

డానికి సదుపాయము లున్నవి. కసరత్తు కవాతు తక్కిన విషయాలతో సమానస్థానము వహించి ఉన్నవి. పరీక్షలకు అవి ఎంతముఖ్యములో, ఇవి కూడా అంత ముఖ్యములుగానే పరిగణిస్తారు. జర్మను బడులలో మిలిటరీకవాతున్ను, తుపాకులు కాల్చడమున్ను నిషేధించబడినవి. పిల్లలకు మిలిటరీ స్వచ్ఛందదళములు లేవు.

నెలకొకరోజు నిర్బంధముగా పిల్లలు శాస్త్ర పరిశోధన విహారమునకు పోవలెను. ఈ దినమునకు "వండర్ టగ్" (Wandertag) అని పేరు. ఈదినమును మొన్నటియుద్ధకాలములో గవర్నమెంటువా రేర్పాటుచేసినారు. బరువైనసంచి మోసుకొని బారులుగా పోవడమును పిల్లలకు నేర్పేవారు వయస్సుమీరిన పిల్లలను యుద్ధములోనికి తీసికొని పోవడమే ఈశిక్షణముయొక్క ఉద్దేశము. ఇప్పుడీ శాస్త్రపరిశోధనవిహారములకు పిల్లలు తమ ఉపాధ్యాయులతో కలసిపోతారు. చిన్నపిల్లలు దగ్గరనున్న పట్టణములకుపోయి ప్రకృతి పరిశీలనముతో కాలము గడుపుతారు. పెద్దపిల్లలు ఫాక్టోరీలు,

నౌకాలయాలు, మొదలయిన కార్ఖానాలకు పో-
తారు. ప్రతి విద్యార్థిన్ని తాను చూచినదంతా
వ్రాసుకొని, విహారమును గురించి ఉపన్యాసము
వ్రాయవలెను. ప్రధానోపాధ్యాయుని యాజ
మాన్యమున నడిపే బడిపత్రికలో వీటిలో కొన్ని
టిని ప్రకటిస్తారు.

విద్యార్థులకు తమతమ సంఘము లున్నవి, కాని ఇంగ్లాండులో ప్రతిబడిలోను ఉండే చర్చా సంఘము లున్ను, పఠనాలయాలున్ను జర్మనీలో లేవు.

### తల్లిదండ్రుల సంఘము.

(ఎల్ టెర్న్ బెయిరాట్ Elternbeirat)

జర్మనీలో ప్రతిబడిలోను శాసనము ప్రకారము ఒక తల్లిదండ్రులసంఘ ముంటుంది. దీనిలోని సభ్యులను పిల్లల తలిదండ్రు లెన్నుకొంటారు. 50 మంది పిల్లలకొక సభ్యుడు చొప్పున బడిలోని పిల్లలసంఖ్యనుబట్టి ఈసంఘములో సభ్యులసంఖ్య కూడా ఉంటుంది గృహవిద్యకున్ను పాఠశాలా విద్యకున్ను సామరస్యము కల్పించడము, పిల్లల

తలిదండ్రులలో బడిలోని పనినిగురించి ఉత్సాహ
ము పుట్టించడము, ఔన్నత్యమును ఎక్కువ స్థా-
యిలో ఉంచడము, అనేవి ఈసంఘము ఉద్దేశ
ములు. ఈసంఘములు కొన్ని మంచిపనిచేస్తవి.

బడిలోని తరగతులలోనికి పోవడానికి తల్లి
దండ్రులకు హక్కున్నది. యుద్ధమునకు పూర్వ
మిట్టి ప్రశంసకే అవకాశము లేకుండేది. ఇప్పుడు
స్వాతంత్ర్యము ఇంకా ఎక్కువఅయినది. విద్యా
ర్థులు తమలో ఒకరిని తమకుబదులుగా మాట్లాడ
డానికి ఎన్నుకొంటారు. వీనికి "స్ప్రెకర్"
(Sprecher) అనిపేరు. ఈవిద్యార్థి పాఠక్రమ
మును గురించిన్ని, కాలమును గురించిన్ని, తమ
ఉపాధ్యాయునితోను తలిదండ్రుల సంఘముతోను
విద్యార్థుల కోరికలను తెలుపుకోవచ్చును. విద్యా
ర్థులు తమకోరికలను అములులో పెట్టుకొనుట
కధికారము లేదుగాని, వాటిని వినేటట్లు చేయ
గలరు.

ప్రతిబడికిన్ని 'లాండ్ షెమ్' (Landsheim)
అనే ఒకగృహ ముంటుంది. ఇది పట్టణమునకు

కొంతదూరములో, పల్లెటూళ్ళమధ్య ఉంటుంది. పిల్లలకు ఒకవారమురోజులు ప్రతితరగతివారున్న ఈ ఇంటికిపోయి అక్కడనే నివసిస్తారు. ఇక్కడ పిల్లలు తమ తిండికోసము సామ్మిచ్చుకోవలెను. రోజున్ను రెండుగంట లిక్కడ పాఠములు జరుగు తవి; తక్కినకాలము పిల్లలు ఏదోఒక అనుభవము సంపాదించుకొంటూ ఉంటారు. పదార్థవిజ్ఞాన శాస్త్రము చెప్పే ఉపాధ్యాయుడు సాధారణ వస్తువులతో టెలిఫోనులు నిర్మించగా, ఒకరితో ఒకరు దూరమునుండి మాట్లాడుకొంటారు. గణితము బోధించే ఉపాధ్యాయుడు నక్షత్ర పరిశోధనము చేయిస్తాడు. ఈగృహమున కనుబంధముగా ఒక పొలముకూడా ఉంటుంది. దానిమీద పిల్లలు పనిచేస్తారు. పట్టణాలలో ఉండే బాలురకు పల్లెటూరిజీవనము ఏలాగు ఉంటుందో చూపి నిజమైన జీవనముతో వారికి పరిచయము కలిగించడమే ఈగృహము ఉద్దేశము. ఇక్కడ పిల్లలకు మన సుకు వచ్చినంతమంచిగాలి, వ్యాయామము, లభించడమే కాకుండా, వారు స్వయముగా పని చేసు

కోపడమునకున్ను, నిరాడంబరజీవనము చేయడమునకున్ను అలవాటు పడుతారు.

---

## అధ్యాయము ౧౦.

### జర్మనీలోని పల్లెవసతి పాఠశాలలు.

( లాండ్ షుల్ హేమ్ Landschulheim. )

క్రిందటి శతాబ్దము అంతమున డాక్టరు లీట్సు అనే ఆయన ఇంగ్లాండులోని విద్యాపద్ధతి మీద ఉత్సాహముచూపి "లాండ్ షుల్ హేమ్" అనేపేరుగల మూడు వసతిబడులను స్థాపించినాడు. వాటిలో ఒకటి చిన్నపిల్లలకున్ను, రెండోది ఈడు వచ్చిన పిల్లలకున్ను, మూడోది మధ్యవయస్సు పిల్లలకున్ను, ఉద్దేశింపబడ్డవి. చిన్నపిల్లల వసతిబడి ఇంగ్లాండులోని వసతి ప్రారంభ పాఠశాలలకున్ను, తక్కిన రెండున్ను ఇంగ్లీషు పబ్లికుపాఠశాలలలోని రెండుభాగములకున్ను సరిపోతవి. వీటిలో క్లాసుచదువు తక్కువగాను, ఆటలు, వ్యాయామములు ఎక్కువగాను ఉంటవి. ఈ బడులలో

పనిచేసిన కొందరు ఉపాధ్యాయులు పాఠముల మీద ఎక్కువశ్రద్ధ చూపవలసినదని అభిప్రాయ పడి, తమ స్వంత వసతిబడులను ఏర్పాటు చేసు కొన్నారు. ఈ పబ్లికుబడులవల్లనే ఇంగ్లీషువారు ఎక్కువ రాజనీతిజ్ఞులయినారనిన్ని, అవి లేకపోవడ ముచేత జర్మనులలో రాజనీతి మందగించినదనిన్ని జర్మను లనుకొని, ఈపాఠశాలలను ఎక్కువ ప్రో త్సాహపరచడ మారంభించినారు. ప్రస్తుతము జర్మనీలో పధ్నాలుగు పబ్లికువసతిబడు లున్నవి. ఇవన్నీ ప్రయివేటుబడులే కొన్నిటికి మాత్రము ప్రభుత్వమువారు నామకాగ్రాంటు లిస్తున్నారు. పిల్లలు చెల్లించే జీతములమీదనే ముఖ్యముగా ఈ బడులు నడుస్తున్నవి. ఈబడులలో ఒకటి ఈక్రింద వర్ణింపబడినది.

ఈబడికి అధికారవర్గమువారు పెద్దపట్టణా లలో ఉండే ఆరుగురు ధనవంతులనుంచి ఎంచుకొం టారు. వీరు సాధారణముగా సంవత్సరమున కొక సారికలిసి, బడి నడుపవలసిన పద్ధతి, బడికికావలసిన క్రొత్తగృహములను నిర్మించడము, క్రొత్త బోధన

విషయములను బడులలో చేర్చడము, మొదలయిన వాటిని గురించి ఆలోచిస్తారు. ప్రధానోపాధ్యాయుడున్ను, ఖాయము ఉపాధ్యాయులలో ఎక్కువ అనుభవము గలవారున్ను, బడి నిత్యవ్యవహారాలను చూచుకొంటారు. ప్రధానోపాధ్యాయుడు చిన్న చిన్న ఖాళీలు పడినప్పుడు ఉపాధ్యాయులను తానే నియమించవచ్చును గాని, ఉపాధ్యాయులలో ఎవరినైనా ఖాయము చేయడానికి, సీనియరు ఉపాధ్యాయులసమ్మతి కావలసిఉంటుంది. ఇంగ్లీషు పబ్లికుబడులలోవలె ఈబడి ప్రధానోపాధ్యాయునికి సర్వస్వాతంత్ర్యము లేదు. ఇతనికి అధికారవర్గము వారు చిన్నచిన్న విషయాలలో తొందరలు కలిగించరు.

ఈబడిలో 190 మంది విద్యార్థు లున్నారు. వారు నాలుగు వాయిదాలలో సంవత్సరమునకు 90 పౌనులనుండి 120 పౌనుల వరకు జీతములు చెల్లిస్తారు. క్లాసులనుబట్టి జీతములుకూడా ఎక్కువ అవుతవి. కొంతమంది బీదబాలురను తక్కువ జీతాలమీదకూడా చేర్చుకొంటారు. ఈ బడికి

సంవత్సరము రాబడి 19000 పౌనులు. ఈ మొత్తము ఖర్చులకు సరిపోతుంది. భోజనము ఖర్చెంత, చదువుజీతమెంత, నాలుగు కాలాలుండే వస్తువుల మీాద ఖర్చెంత, నిత్యమున్ను అయ్యేఖర్చెంత, అనే విభేదములు చేయరు. కొత్తయిళ్ళు కట్టించడానికిన్ని, ఇటువంటి ఇతర పెద్దఖర్చులకున్ను, బాలురు చెల్లించేసొమ్ము చాలదు.

ఈ బడిలో మగపిల్లలు, ఆడపిల్లలు కలిసి వసతిగృహాలలో ఉండడము గమనింప దగినది. ఇంగ్లాండులోని క్వేకరు (Quaker Schools) బడుల ననుసరించి ఈ విధానము నేర్పాటు చేసినారు. మగపిల్లల గదులనుంచి, ఆడపిల్లలగదులను వేరు చేయవచ్చును. ఇట్లు ఆడపిల్లలున్ను మగపిల్లలున్ను కలిసి ఉండడమువల్ల ఎట్టిదోషములున్ను కలుగలేదు. కాని ఈపద్ధతి ఎంతో కాలము అమలులో లేకపోవడముచేత, ఈపద్ధతి ఎంతవరకు సాగగలదో ఇంకా చెప్పడానికివీలులేదు. బాలబాలికలిద్దరున్ను ఈవసతిగృహములో 19 ఏళ్ళ వయస్సువరకు ఉండి అబిట్యూరియెంటెన్ పరీక్షకు పోతారు.

తక్కిన ఉన్నత పాఠశాలలలోవలె ఈ పరీక్షను క్లాసుఉపాధ్యాయులే చేస్తారు. ఆ మండలము ఇన్స్పెక్టరుకూడా ఉపాధ్యాయులతో కలిసి ఈపరీక్షను జరిపిస్తారు. ఇన్స్పెక్టరు గవర్నమెంటు బడుల మీదకంటె, ఈప్రయివేటు బడులమీద ఎక్కువ శ్రద్ధ తీసుకొంటారు. ఆడపిల్లలు మగపిల్లల పాఠములనే చదివి, వారిపరీక్షలోనే కృతార్థురాండ్రు కావలెను. చేతిపనులలో మాత్రము కొంచెము భేదమున్నది. మగపిల్లలు వడ్రంగము, కమ్మరము, యంత్రనిర్మాణము నేర్చుకొంటారు. ఆడపిల్లలు కుట్టుపని, వంట, గృహనిర్వాహకత్వము నేర్చుకొంటారు.

పిల్లలకు ఏవిధమయిన దండనమున్ను చేయరు. జర్మనీ దేశములో పిల్లలకు దేహదండనము నిషేధింప బడినది. జర్మనుపిల్లలు బడుల కట్టుబాట్లను ఎన్నడున్ను మీరరట. ఈ బడులలో అట్టి 'రూల్సు' లేకపోవడమే వాటిని అతిక్రమించక పోవడానికి కారణమై ఉంటుంది. ఇతరబడులలో ఉండే 'ఇట్లు చేయావలెను', 'ఇట్లు చేయకూడదు'

అనే ఆజ్ఞలు ఈబడిలో లేవు. మొత్తముమీద జర్మనుజాతివారు మంచి శిక్షణములో ఉండడానికి అలవాటుపడి, తమతమ పనులను సైనికులవలె 'తు,చ' తప్పకుండా చేసుకొంటారు. ఈ బడిలో ఇంటిపెద్ద (Proctor) గాని, తరగతి పెద్దలు (Monitors) గాని లేరు. పిల్లలందరున్ను తమ యిష్టమువచ్చిన పని చేసుకోవచ్చును. పిల్లలు పొగాకుచుట్టలు, సిగరెట్లు కాల్చకూడదు; సారాయములను సేవించకూడదు. పిల్లల ఎదుటగా ఉపాధ్యాయులుకూడా సిగరెట్లను, చుట్టలను తాగకూడదు.

ఇంగ్లీషు పబ్లికుబడులలో కొంతమంది ఉపాధ్యాయులను గృహోపాధ్యాయులనుగా నియమిస్తారు. ఉపాధ్యాయులలో అనేకులకు ఉంటుటకు ఇండ్లను ఇవ్వనైనా ఇస్తారు; లేకపోతే వారే ఇండ్లను అద్దెకు తీసుకోవలెను. కాని, అందరు ఉపాధ్యాయులున్ను పిల్లల వ్యాయామక్రీడలలోను, వారి విందులలోను పాల్గొనవలెను. జర్మనీలో ప్రతి ఉపాధ్యాయున్ను ఒకొక్క పిల్లల వసతి

గృహమునకు యజమానుడుగా ఉంటాడు. అతడు పెండ్లిచేసుకొని ఉంటే, అతనిభార్య గృహయజమానురా లవుతుంది. ఉపాధ్యాయుల పిల్లలు నామకాగా కొంతసొమ్ము చెల్లించిగాని, ఉచితముగాగాని, తలిదండ్రులతో వసతిగృహములలోనే ఉంటారు.

ఇంగ్లీషు పబ్లికుబడులలో ఉండే గృహపద్ధతి జర్మనీలో లేదు. ఇంగ్లాండులో ఈగృహపద్ధతి సర్వజనాదరణపాత్రమై, వేళ్ళునాటుకొని ఉన్నది. పగటిబడులలోని పిల్లలుకూడా కొన్ని గృహములలో ఉండేటట్లు ఏర్పాటుచేస్తారు. ఈ జర్మను బడిలో పదేసిమంది పిల్లలకు ఒకొక్క గృహము ఏర్పాటుగా ఉన్నది. ఒకేగృహములో ఆడపిల్లలను మగపిల్లలను కలిపిఉంచరు. ఈ గృహానికి ఉపాధ్యాయుడు యజమానుడు; అతనికి భార్య ఉంటే ఆమె యజమానురాలు. వారి పోషణము క్రింద పదిమంది మగపిల్లలుగాని, పదిమంది ఆడపిల్లలుగాని ఉంటారు. వీరందరున్ను ఒక్కటేబల్లు దగ్గర కూర్చుండి భోజనము చేస్తారు. అందరున్ను

కలిసి విహారాలకుపోతారు. ఒకొక్క కుటుంబము వారుకలిసి కూర్చుండడానికి ఒకచావడి ఉంటుంది. ఇక్కడ పిల్లలు అంతర్గృహక్రీడలు ఆడుకొంటారు. సాధారణముగా "పింగ్ పాంగ్" (Ping pong) అనే టేబిలుటెన్నిసుఆట ఆడుకొంటారు. ఇక్కడనే బడిపాఠాలు చదువుకొంటారు. పెద్దపిల్లలు కూర్చొనడానికి మరిఒకగది ఉంటుంది.

వ్యాయామక్రీడల విషయములో బడిలోని పిల్లలందరున్ను కలిసి, వేరువేరు "జట్టు"లుగా విడబడతారు. వీరన్ని ఆటలున్ను ఆడతారుగాని క్రికెట్టుఆట ఆడరు ఈ ఆట చాలా మెల్లగా నడస్తుందనిన్ని, వృథా కాలహరణమవుతుందనిన్ని జర్మనుల అభిప్రాయము. సాధారణ పాఠశాలలలో కంటె ఈబడిలోని పిల్లలు ఎక్కువగా విహారాలకు పోతూఉంటారు. సాధారణముగా పిల్లలు సంవత్సరానికి రెండువారాలు విహారాలమీద ఉంటారు. ఎండకాలములో 8 రోజులు, ఆకురాల్పుకాలములో 3 రోజులు, చలికాలములో 3 రోజులు విహారదినములు. ఇందు

లోని పిల్లలు ధనవంతుల కుటుంబములోనుంచి వస్తారుగనుక, చాలాదూరవిహారాలు చేయడమే కాకుండా, పరదేశాలకుకూడా పోతూఉంటారు.

బడిలోని పిల్లలందరున్ను, ఒకే చావడిలో భోజనము చేస్తారు. ఒక్కొక్క టేబిలువద్ద ఒక్కొక్క గృహముపిల్లలు కూర్చుంటారు. ఈ టేబిలువద్ద ఒకప్రక్క యజమానుడున్ను, అతని కెదురుగా యజమానురాలున్ను కూర్చుంటారు. వంటగదిలో విద్యుచ్ఛక్తితో పనిచేసే ఉపకరణములుంటవి. రొట్టెలను ఒకే దళసరిగా ముక్కలు కోస్తారు. కూరగాయలను యంత్రాలతో తరుగుతారు. రొట్టెకుపిండి విద్యుచ్ఛక్తి యంత్రాలతో విసురుతారు. ఈ ఉపకరణాలన్నీ కొంచెము వెలలకు చిక్కుతవి. ఈ బడిలోని పిల్లలు భోజన విషయమై ఏమాత్రమున్ను అసంతృప్తి పొందరు. దీనిలోని రహస్య మేమిటంటే, ఉపాధ్యాయులు, వారిభార్యలు, పిల్లలు, బడిపిల్లలు, తుదకు ప్రధానోపాధ్యాయుడు కూడా ఒకే టేబిలు మీద, ఒక్కమోస్తరు భోజనమే చేస్తారు.

ఉపాధ్యాయులు ప్రత్యేకముగా వంట చేసుకో కూడదు. మధ్యాహ్న భోజనమయిన తరువాత విద్యార్థులందరున్ను ఇంటి ముందర అంగణములో కూడుతారు. వర్షముగా ఉంటే, హాలులోనే కూడుతారు. అప్పుడు ప్రధానోపాధ్యాయుడు చిన్న ఉపన్యాస మిస్తాడు. అతని తరువాత ఒకరిద్దరుపాధ్యాయులున్ను కొంత మంది విద్యార్థులున్ను మాట్లాడుతారు ఆ దినమునకు కార్యక్రమమును అక్కడనే అందరికిన్ని తెలుపుతారు. విద్యార్థులు తమలో తామెంచుకొన్న అయిదుగురు స్వదేశ, విదేశ, వార్తా పత్రికలు చదివి, వాటిలోని భోగట్టాను సంగ్రహముగా అందరికిన్ని తెలుపుతారు. పక్షమునకొకసారి, ఒక విద్యార్థి దేశమునకు సంబంధించిన ఏదయినా ఒక విషయమును గురించి వ్యాసమువ్రాసి చదువుతాడు. దానిలో ఆ విషయమునుగురించి విదేశీయ వార్తా పత్రికల అభిప్రాయము కూడా తెలుపుతాడు. ఈ వ్యాసము వ్రాయడానికి ఉపాధ్యాయులు సహాయము చేయవలెను. విద్యార్థులకు పఠనాలయమున్ను

గ్రంథాలయమున్ను, ఒకఉపాధ్యాయుని వశము లో ఉంటుంది. ఈ బడిలో చర్మాసంఘము లేదు.

విద్యాపద్ధతులున్ను, విద్యోపకరణములున్ను, మిక్కిలి నవీనమార్గము ననుసరించి ఉన్నవి. విద్యార్థులకు కావలసినన్ని మంచి పుస్తకము లున్నవి. ప్రతి ఉపాధ్యాయునికిన్ని, 200 నుంచి 500 పుస్తకాలవరకు స్వంతముగా ఉంటవి. పాఠాలు చెప్పే గదులన్నీ వేరువేరుగా ఏకమొకముగా ఉన్నవి. అన్నీ ఒక్కటే భవనములో లేవు. ఈబడిలో అనుభవవిద్యమీద ఎక్కువ శ్రద్ధ వహిస్తారు. ప్రతివిద్యార్థిన్ని మధ్యాహ్నము రెండుగంటలకాలము ఏదో ఒక చేతిపని చేయవలెను. పిల్లలు వడ్రంగము, కమ్మరము కాక తోటపని, పొలముపనికూడా చేస్తారు. బడిలోని బెంచీలు, కుర్చీలు, మొదలయిన సామానులను పిల్లలే చేస్తారు. వాటికి చిన్న చిన్న మరమ్మతులు కూడా వారే చేస్తారు. శాస్త్రమును బోధించే గదులు పరిశోధనాగారములుగా కూడా ఉపయోగించేటట్లు కట్టుతారు.

జర్మనీలో ఈవసతిబడులు ప్రారంభములో ఉన్నవి. కాని, జర్మనులు ఇటువంటిబడు లింకా ఎక్కువగా కావలెనంటున్నారు. ఇంగ్లీషు పబ్లికు స్కూళ్ళలో తమ వసతిగృహము, తమబడి, అనే అభిమానము ఎక్కువగా ఉంటుంది ఈ అభిమానము జర్మనీలో ఇంకా స్థిరపడలేదు.

---

## అధ్యాయము ౧౧.

### విశ్వవిద్యాలయములు, వృత్తికళాశాలలు.

### (హోక్ షూలె Hoch Schule.)

ఉన్నతపాఠశాలలోని అంత్యపరీక్ష అయిన "అబిట్యూరియెంటెన్" పరీక్ష ప్యాసైన వారినే చేర్చుకొనే కళాశాలలను ఈ క్రింది రీతిగా విభజించ వచ్చును.

(1) విశ్వవిద్యాలయములు: వీటిలో కళలు, శాస్త్రములు, వైద్యము, స్మృతులు (Law), మతము నేర్పుతారు. కొన్నిటిలో వ్యవసాయము కూడా ఉంటుంది.

(2) ఇంజనీరింగు కళాశాలలు (హాక్ షూలె Hoch Schule): వీటిలో విద్యుచ్ఛక్తి ఇంజనీరింగు, యంత్రముల ఇంజనీరింగు, శిల్పము, సివిలు ఇంజనీరింగు, రసాయన శాస్త్ర ఇంజనీరింగు, నేర్పుతారు. కొన్నిటిలో ఉపాధ్యాయులకు శిక్షణము కూడా ఇస్తారు.

(3) పశువైద్య కళాశాలలు

(4) వ్యవసాయ కళాశాలలు.

(5) అడవి కళాశాలలు.

(6) వాణిజ్య కళాశాలలు.

వీటిలో తుది నాలుగింటిలోను ఏదో ఒకొక్క విషయము మాత్రమే బోధిస్తారు. వీటిలో చదువుకొనేవారికి కూడా "డాక్టరు" బిరుదమునిస్తారు. కార్మిక విషయములున్ను, వృత్తివిషయములున్ను, ఇంగ్లాండులో విశ్వవిద్యాలయాలలో చేరి ఉంటవి. కాని, జర్మనీలో ఈ విషయాలలో ఒకొక్కదానికి ఒకొక్క కళాశాల ఉంటుంది. ఒకొక్క కళాశాలయున్ను ఒక విశ్వవిద్యాలయమయి, విశ్వవిద్యాలయపు హక్కులను

కలిగి ఉంటుంది. జర్మనీ దేశము జనసంఖ్య ఆరు కోట్ల ఇరవై అయిదు లక్షలు, అంటే ఇండియా జనసంఖ్యలో అయిదో భాగము. ఈ జన సంఖ్యకు 49 విశ్వవిద్యాలయాలున్నవి. వీటిలో 23 లో సాధారణవిషయాలు బోధిస్తారు. పదింటిలో ఇంజనీరింగు చెప్తారు. నాలుగింటిలో ప్రత్యేకముగా వ్యవసాయము నేర్పుతారు. రెండింటిలో పశురోగచికిత్సను గురించిన్నీ, అయిదింటిలో అడవులను గురించిన్నీ, అయిదింటిలో వాణిజ్యమును గురించిన్నీ చెప్తారు.

ఈ 49 విశ్వవిద్యాలయాలలోను 113,657 మంది విద్యార్థులున్నారు. వీరిలో 8,824 మంది పరదేశీయులు, ఇండియా దేశపు విద్యార్థులు 67 గురు: ఉపాధ్యాయుల సంఖ్య 7,489. వీరిలో 2,441 మంది అధ్యాపకులు (Professors) స్త్రీ విద్యార్థినుల సంఖ్య వేగముగా అభివృద్ధి చెందుతున్నది.

ప్రతి విశ్వవిద్యాలయములోను అన్ని విషయాలను బోధించినా, ఒకొక్కటి ఒకొక్క విషయమును గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకొంటుంది.

ఆ విషయములో గొప్ప పేరు ప్రతిష్ఠలను సంపాదించిన అధ్యాపకులనే అందులో నియమిస్తారు. ఏ విషయము ఏ విశ్వవిద్యాలయములో ఎక్కువగా బోధిస్తారో "మైనెర్వా" అనే పుస్తకములో గాని "డిహాక్షూలెన్ డోయిష్లాండ్" అనే పుస్తకములో గాని ఉంటుంది. ఈ రెండో పుస్తకమును డాక్టరు రోమ్మె అనే ఆయన వ్రాసినాడు. ఇతని పై విలాసము, డైరెక్టర్ ఆఫ్ ఫారిన్ ఇన్ఫర్మేషన్స్, 4 ఉంటర్-డెన్-లిండెన్, బెర్లిను (Dr. Romme, Director of Foreign Infourmations, 4, Unter-den-Linden, Berlin, Germany.) ఆయనకు వ్రాస్తే పుస్తకము చిక్కుతుంది.

పైని తెలిపిన 49 విశ్వవిద్యాలయాలలోను డాక్టరు బిరుదము నిస్తారు. కొన్ని విషయముల లో, అనగా మతము, ఇంజనీరింగు, వ్యవసాయము, వాణిజ్యములలో ఇంటర్మీడియేటు పరీక్ష ఒకటి ఉంటుంది. ఇది ఇంగ్లాండులోని బి.యే. పరీక్షకున్ను బి. ఎస్. సి. పరీక్షకున్ను, ఫ్రాన్సులోని

"లైసెన్సు" పరీక్షకున్ను సరిపోతుంది. ఇంజనీ రింగు కళాశాలలలో ఈ పరీక్ష రెండు భాగాలు గా ఉంటుంది. విద్యార్థులు ఏ కార్మికశాఖలో ఎక్కువ కృషిచేయవలెనో సలహా ఇవ్వడమునకు న్ను, ఒక సంవత్సరము అనుభవము పొందడానికి ఆ యా ఫాక్టరీలవారి నడిగి విద్యార్థులను పంపడ మునకున్ను, ప్రతి ఇంజనీరింగు కళాశాలలోను ఒక ప్రత్యేక శాఖ ఉంటుంది. ఇంజనీరింగు పరీక్షలో కృతార్థత పొందడానికి ఈఅనుభవము అవసరము. జర్మ... కిప్పటికిన్ని ఒకటైనా వలస దేశము (Co... లేకపోయినా, విట్సెన్ హౌసెన్ (Witsen h...) అనే పట్టణములోని వలసకళాశాలను (Col... College) సాగిస్తూనే ఉన్నారు. ఈ కళాశాల... 2000 మంది విద్యార్థులున్నారు. దీని లో ఇ... విషయాలతోపాటు వృక్షశాస్త్రము, వ్య వసాయ..., దేశములోని పంటలను వద్ధిచేసే విష యముల... నేర్పుతారు. ఇంగ్లీషువారికి ఎన్నో వలసరా...జ్యాలున్నా వారి కిటువంటి కళాశాల లేక పోవడము విచిత్రముగా నున్నది. వలసరాజ్యాలకు

పోయే ప్రతి ఇంగ్లీషువాడున్ను తన స్వానుభవము నుపయోగించి ఆరాజ్యములోని వ్యవసాయమును, ఇతర విషయాలను అభివృద్ధిచేసుకోవలెను. పైని చెప్పిన జర్మనుకళాశాలలన్నిటిని మూలప్రభుత్వము వారే పోషిస్తారు.

వైద్యములో పట్టభద్రులు కావడానికి ఆ రేళ్ళు చదువుకోవలెను. రెండోయేడు ఆఖరున ఒక పరీక్ష జరుగుతుంది. తరువాత విద్యార్థులను ఆసుపత్రులలో పని చేయడానికి పంపుతారు. యూరోపుఖండములోనేకాక, ప్రపంచ మంతటి లోను పెద్దదయిన వైద్యవిద్యాలయము జర్మనీలోని "వియెన్నా" (Vienna) పట్టణములో నున్నది. దీనికి సంబంధించిన ఆస్పత్రులలో 20,000 రోగులకు మంచములున్నవి. ఈ వైద్యవిద్యను రాక్‌ఫెల్లర్ (Rockfeller) అనే అమెరికా కోటీశ్వరుడు ప్రపంచములో వైద్యసహాయముకోసము నిధిగా ఏర్పరచిన సొమ్ముతోనే చాలాభాగము జర్మనీలో సాగిస్తున్నారు. ఇంగ్లీషుమాత్రము తెలిసే గ్రాడ్యుయేట్లు ఇంకా ఎక్కువగా నేర్చుకొనడానికి

ఈ జర్మను వైద్యవిద్యాలయాలకు వస్తారు. వారి కోసము ఇంగ్లీషులో కూడా ఉపన్యాసా లిస్తారు. అమెరికావారు ఇంగ్లీషుమాట్లాడేవారికి జర్మను వైద్యవిద్యను గురించిన భోగట్టా తెలుపడానికి ఒక సంఘము స్థాపించినారు. ఈ సంఘమునకు "అమెరికన్ మెడికల్ ఎసోసియేషన్" (American Medical Association) అని పేరు. దీని విలాసము 9, ఆల్సాక్ స్ట్రెస్సె, వియెన్నా 9. Alsac Strasse Vienna.)

జర్మను విశ్వవిద్యాలయాలలో తరగతుల విభాగముగాని, ఫలానా ఉపన్యాసాలనే నియమము గాని లేవు. ఇందుచేత చాలా గందరగోళముగానే ఉంటుంది. ఉన్నతపాఠశాలలో తరగతి అయిన తరువాత తరగతి చదువుకొంటూ, ఒక పాఠక్రమ ము ననుసరించి శిక్షణము పొంది, పరీక్షలు వ్రాసవు- త్తీర్ణుడైన విద్యార్థి, విశ్వవిద్యాలయములో ప్రవేశించగానే స్వతంత్రుడయిపోయి, దిక్కు-దెస లేకుండా, అధ్యాపకుల సహాయము లేక తనంతట తానే చదువుకోవలసివస్తుంది. వీనికి "ట్యూటర్లు

అనగా చదువుచెప్పేవారుండరు. తానేమి చేయ వలెనో వానికి తోచదు. అందుచేత అతడు తన పనిమీద శ్రద్ధవహించక, సంఘములలోను, వివాదములతోను కాలయాపనముచేసి, ఒకటిరెండేళ్ళు కాగానే మరొక విశ్వవిద్యాలయానికి పోయి, శ్రద్ధగా చదువుకోవడ మారంభిస్తాడు. ఈ వృథా కాలక్షేపమును గురించి జర్మనుఅధ్యాపకుల కందరికీ తెలుసును. కాని, వారు దానిని ఆటంక పెట్టడానికి ప్రయత్నించరు. విద్యార్థులు తమ స్వాతంత్ర్యభంగమును సహించరని వారికి తెలుసును. యుద్ధమయిన తరువాత ఈ విషయమై రెండు పద్ధతులను ఆలోచిస్తున్నారు.

(1) ఉన్నతపాఠశాలలకున్ను, విశ్వవిద్యాలయాలకున్ను మధ్యగా ఇంటర్మీడియేటు కళాశాలలను ఏర్పాటుచేయడము. ఈ కళాశాలలలో తరగతులలో పాఠాలు జరుగుతూఉన్నా విద్యార్థులకు కొంచెము స్వాతంత్ర్య ముంటుంది. ఈ కళాశాలలలో రెండేళ్ళు చదువవలెననిన్ని, వాటిలో ఒక యేడు హైస్కూలు విద్యాక్రమమున్ను, రెండో

యేసు ఇప్పుడు వృథా అవుతూఉన్న విశ్వవిద్యా లయపు మొదటి సంవత్సరపు చదువున్ను, అయి ఉండవలెనన్ని, అనుకొంటున్నారు.

(2) విశ్వవిద్యాలయములోనే విశేషజ్ఞానమును సంపాదింప నారంభించడానికి పూర్వము రెండేళ్ళు మాధ్యమిక పాఠాలు నేర్పడము, అంటే, ఇంటర్మీడియేటు కళాశాలలను విశ్వవిద్యాలయాలలో భాగములుగా ఏర్పాటు చేయడమన్న మాట. ఈ విషయమై కావలసిన పాఠక్రమము లు మొదలయినవి తయారైనవి. ఈ భాగములో సామాన్యజ్ఞానము, విద్యాశోధనము, రాజనీతి, కూడా విషయములుగా ఉంటవి.

విద్యార్థులసంఖ్య నానాటికి ఎక్కువ కావడము చేత ఒక "ప్యాసు"డిగ్రీ, అంటే సాధారణ బి. యే. డిగ్రీ వంటిది, చేర్చవలెనని ఒక సలహా ఉన్నది. జర్మను విశ్వవిద్యాలయాలలో ప్రస్తుతము "డాక్టరు"డిగ్రీ ఒక్కటే ఉన్నది. పరిశోధనలు సాగించి, క్రొత్త విషయాలను కనుగొన్న వారికే ఈ పట్టము నిస్తారు. ఒక్క పరీక్షలో

కృతార్థులయి పట్టములు సంపాదించేపద్ధతి జర్మనీలో లేదు.

పరిపాలనము.

జర్మను విశ్వవిద్యాలయాల పరిపాలనము ఏమీ చిక్కులేనిది. వీటిలో రెండే సభలు, ఇద్దరే ఉద్యోగులు ఉంటారు. (1) ఫేకల్టీలు (2) సెనేటు-ఈ రెండున్ను సభలు. వీటి అధ్యక్షులే ఉద్యోగులు.

విశ్వవిద్యాలయములోని అధ్యాపకులందరున్ను, తమతమ విషయాలకు సంబంధించిన ఫేకల్టీలో సభ్యులుగా ఉంటారు. సెనేటులో పదకొండుగురు సభ్యులు మాత్రమే ఉంటారు. వీరిని ఫేకల్టీవారు ఎన్నుకొంటారు. ఏ ఫేకల్టీవారు ఎంతమందిని సెనేటుకు ఎన్నుకోవలెనో శాసనము ప్రకారము నిశ్చయమై ఉంటుంది. విశ్వవిద్యాలయములో సెనేటు సభ్యులుమాత్రమే గౌనులు వేసుకొనడానికి అర్హులు. ఒకొక్క ఫేకల్టీకీ సభ్యులు ఎన్నుకొన్న 5 నుంచి 7 గురు వరకుగల ఒక కార్యనిర్వాహక సంఘముంటుంది.

సెనేటు అధ్యక్షునికి "రెక్టోయర్" (Recteur) అనిపేరు. మన విశ్వవిద్యాలయాల లోని ఛాన్సెలరు, ప్రోఛాన్సెలరు, వైస్‌ఛాన్సెలరు, ప్రోవైస్‌ఛాన్సెలరు అనేవారి అధికారాలన్నీ ఈయనకుంటవి. విశ్వవిద్యాలయ అధ్యాపకుల లోనుంచి సెనేటువారు ఈయనను ఎన్నుకొంటారు. ఇతను ఒక్క సంవత్సరమే ఆ పదవిలో ఉంటాడు. తరువాత తిరిగీ అతనిని ఎన్నుకో కూడదని నిషేధము లేదుగాని, సాధారణముగా అతనినే ఎన్నుకోరు. ఒక శతాబ్దములో మూడు పర్యాయములు మాత్రమే ఒకే వ్యక్తిని అధ్యక్షునిగా ఎన్నుకొన్నట్లు తెలియవస్తున్నది. "రెక్టోయర్" పదవినుంచి తొలగిన ఆయన ప్రో-రెక్టోయర్ అవుతాడు. ఇది కేవలము గౌరవోద్యోగము. "రెక్టోయర్" ఊరిలో లేనప్పుడు అతనికి బదులుగా అధ్యక్షస్థానములో కూర్చొనడముతప్ప "ప్రో-రెక్టోయరు" కు మరిఒక పనిలేదు.

ఫేకల్టీ అధ్యక్షునికి "డెకాన్" అనిపేరు. ఇతనిని ఫేకల్టీ సభ్యులు ఎన్నుకొంటారు. ఇతను

ఒక్క సంవత్సరమే ఆ పదవిలో ఉంటాడు. ఆ సంవత్సర మయినతరువాత మరి అతనిని ఎన్నుకో కూడదు. ఈ "రెక్టోయర్" కున్ను, ఆయా ఫేక ల్టీల "డెకా్క"నులకున్ను, అధ్యాపకులుగా వారి కిచ్చే జీతముకాక, మరి కొంచెము సొమ్ముకూడ ఇస్తారు.

జర్మను విశ్వవిద్యాలయాలలో "కూరే టర్" అనే ఒక్క ముఖ్యఉద్యోగి కూడా ఉంటా డు. ఇతడు ప్రభుత్వమువారి సివిల్ సర్వీసు ఉ ద్యోగి. ఇతనికి విశ్వవిద్యాలయ పరిపాలనముతో ఏమీ జోక్యములేదు. కాని, అతడు విశ్వవిద్యా లయ స్థలములోనే ఎల్లకాలమున్ను ఉండి అక్కడ జరుగుతూ ఉన్న పనిని గమనించి, దానివిషయమై ప్రభుత్వమువారికి తెలుపుతూ ఉంటాడు. విశ్వ విద్యాలయమువారికిన్ని, ప్రభుత్వమువారికిన్ని, జ రిగే ఉత్తర ప్రత్యుత్తరాలు ఈతనిద్వారా జరుగ వలెను. మంత్రి సాధారణముగా ఈయన సల హానే అనుసరిస్తాడు. ఇతడు విశ్వవిద్యాలయము పనిలో జోక్యము కలుగజేసుకోక పోయినా, తా

నక్కడ ఉండడముచేత విశ్వవిద్యాలయము పని తప్పు దారిపట్టదు.

## ఉపాధ్యాయవర్గము.

విశ్వవిద్యాలయములోని ఉపాధ్యాయులు అధ్యాపకులు (Professors), ప్రయివేటు ఉపాధ్యాయులు, అని రెండు తెగలుగా ఉంటారు. అధ్యాపకులను ఆ యా ఫేకల్టీవారి సిఫార్సులమీద మంత్రి నియమిస్తాడు. ఫేకల్టీవారు మూడు నాలుగు పేర్లు పంపిస్తే వారిలో ఒకరిని మంత్రి ఎంచుతాడు. మంత్రి ఫేకల్టీవారు సిఫార్సు చేసిన వారిలోనుంచే అధ్యాపకులను నియమించవలెనని నిర్బంధములేదు. కాని, అతడు సాధారణముగా వారి సిఫార్సును తోసివేయడు. ఫేకల్టీవారు కూడా బాగా ఆలోచించి సిఫార్సులు పంపుతారు. వారు సాధారణముగా తమలోనుంచి అనుభవజ్ఞులయిన ఒక కమిటీని ఏర్పాటుచేసి ఉంటారు. ఈ కమిటీవారు దేశములో అధ్యాపకులుగా ఉండదగినవారి పేళ్ళనన్నిటిని ఆలోచిస్తారు. జర్మనీలో ఈ అధ్యాపక పదవులకోసము దరఖా

స్తుం పెట్టుకోవలెనని ప్రకటన చేయరు. ఎవరు
న్ను కూడా స్వయముగా దరఖాస్తులు పంపుకోరు.
అట్లు పంపుకొనుట తమ గౌరవమునకు లోపమని
వారనుకొంటారు. ఈ అధ్యాపక పదవిని తాము
స్వీకరించవలసినదని మంత్రి ప్రార్థించడమే జర్మను
సంప్రదాయము. ప్రయివేటు ఉపాధ్యాయులను
ఆయా శాఖలవారు సిఫార్సులు చేసిన వారిలో
నుంచి ఫేకల్టీవారు నియమిస్తారు. ఈ ప్రయివే
టు ఉపాధ్యాయు కు జీతసు-లుండవు. వీరు తమ
ఉపన్యాసములను వినడానికి వచ్చే విద్యార్థులనుంచి
కొంచెము జీతములను పుచ్చుకొంటారు. ఈ మ
ధ్యనే విద్యార్థుల వల్ల వచ్చేసొమ్ము వీరి జీవనానికి
సరిపోదని తెలుసుకొని, వీరికి చిన్న జీతము
సంవత్సరానికి 100 పౌనులు ఏర్పాటు చేసినారు.
ఈ విషయమునకు ఇంతముంది మా ప్రమే ప్రయి
వేటు ఉపాధ్యాయు లుండవలెనని నియమములేదు.
వీరు ప్రయివేటు ఉపాధ్యాయులుగా చేరకపూర్వ
ము, ఒక బహిరంగోపన్యాసము చేయవలెను.
ప్రయివేటు ఉపధ్యాయుని అధ్యాపకునిగా నియ

మింపవచ్చును. అట్టి ఖాళీలేకపోయినా, ఆవిష యమును చెప్పే అధ్యాపకు డంత సమర్థుడు కాక పోయినా, సమర్థుడైన ఒక ప్రయివేటు ఉపాధ్యా యుని, అధ్యాపకుని జీతమంత జీతము మీద కాకుండా అసాధారణ అధ్యాపకుడుగా నియమిం చవచ్చును. ప్రతి అధ్యాపకుడున్ను తన విద్యా ర్థులలో ఒకనిని తనకు సహాయకుడుగా ఎంచుకొం టాడు. ఇతడు తన అధ్యాపకుడు చేసిన ఉప న్యాసాలను వివరించివ్రాస్తాడు. శాస్త్రవిషయా లలో ఇతడుఆయాపరిశోధనలను విద్యార్థులయెదుట చేసికూడా చూపెట్టుతాడు. అధ్యాపకులకు సంవత్స రానికి 500 పౌనులు నుంచి 800 పౌనులవరకు జీత ముంటుంది. ఈజీతముకాక, ఇతడు ప్రతి విద్యా ర్థినుంచిన్ని సంవత్సరానికి 50 పౌనుల నుంచి 200 పౌనులవరకు జీతమువసూలు చేయవచ్చును. జ ర్మను విశ్వవిద్యాలయాలలో విద్యార్థులు తాము విన్న ఉపన్యాసాలకు ఇంతసొమ్ము చెల్లించవలెనని నియమమున్నది. ఈసొమ్ము విశ్వవిద్యాలయానికి పోదు. ఉపన్యాసాలిచ్చిన ఉపాధ్యాయుని కిచ్చి

వేస్తారు. వారానికి నాలుగుగంటల ఉపన్యాసాల చొప్పున ఒక సెమిస్టర్ ఉపన్యాసాలకు విద్యార్థి చెల్లించవలసిన జీతము ఒక షిల్లింగు ఆరుపెన్సులు. శాస్త్ర విద్యార్థులు తమ ఉపకరణములను రసాయనవస్తువులను తామే తెచ్చుకొంటారు. అధ్యాపకుని జీవితాంతమువరకున్నూ నియమించినా అతడు సాధారణముగా 65 ఏండ్ల వయస్సున తనపనిని చాలించుకొంటాడు. అంతట అతనికి ఫేకల్టీతో సంబంధముండదు. అయినా, అతనికి "అధ్యాపకుడు" (Professor) అనే బిరుదము పోదు. అతని జీవితాంతము వరకున్నూ అతని నిండు జీతము వతని కిచ్చివేస్తారు. పని చాలించుకొన్న తరువాత అతడు ఉపన్యాసా లివ్వవలెనని ఉంటే ఇవ్వవచ్చునుగాని, ఇవ్వవలెననే పూచీలేదు. కాని, సాధారణముగా, రిటైరయిన ప్రొఫెసర్లు తమ పరిశోధనములను సాగించుకొంటూ, యూనివెర్సిటీలో తరగతులకు ఉపన్యాసాలిస్తూ, బహిరంగ ఉపన్యాసాలు చేస్తూనే ఉంటారు. జర్మనీలో ప్రొఫెసరు అనేమాట ఒక విశ్వవిద్యాలయ బిరుద

ము వంటిది. ఉపాధ్యాయవృత్తిని మార్చుకొన్నా, "ప్రొఫెసరు" అనే మాటను తనపేరుకు చేర్చుకో వచ్చును.

### విద్యార్థి ప్రవేశము.

ఉన్నత పాఠశాలలోని తుదిదిఅయిన ఆబిట్యూరియెంటెస్ పరీక్షలో కృతార్థులయిన వారందరున్ను విశ్వవిద్యాలయములో చేరవచ్చును. విదేశీయ విద్యార్థులు విశ్వవిద్యాలయములో చేరడము చాలాసులభమైనపని. తనదేశములోని విశ్వవిద్యాలయములో చేరడానికి అర్హతను సంపాదించిన పరదేశ విద్యార్థి జర్మనువిశ్వవిద్యాలయములో చేరవచ్చును. ఇంతమందిని మాత్రమే చేర్చుకోవలెననే నియమము జర్మనుకళాశాలలలో లేదు. ఇంగ్లాండులోని విశ్వవిద్యాలయాలవలె కాక, జర్మను విశ్వవిద్యాలయాలలో ఎంతమంది విద్యార్థులనైనా చేర్చుకొనడానికి అవకాశములున్నవి. విద్యార్థుల సంఖ్య సాధ్యమయినంతమట్టుకు ఎక్కువ చేయడానికే ప్రయత్నిస్తారు. ఇందువల్ల అధ్యాపకులకు మరింత ఎక్కువ జీతము

వస్తుంది. జర్మను విశ్వవిద్యాలయాలు భారతవర్షములోని ప్రాచీన నాలందా, నవద్వీప విద్యాపీఠములను పోలిఉంటవి. విద్యార్థులు ఎక్కువ అయినారే అన్న విచారమేఉండదు. ఒక చిన్న గుమాస్తావద్దకుపోయి, ఒక ఫారమును నింపవలెను. ఆ ఫారములోని ఈ క్రింది విషయములు గమనింపదగినవి:--

14. ఇక్కడ నీవిద్యపూర్తి అయిన తరువాత ఏవృత్తి నవలంబింప దలచినావు?

(i) ఈక్రింది వృత్తులలో ఒకదాని క్రింద గీత గీయుము (ఇక్కడ 60 వృత్తుల పేర్లు వ్రాసి ఉంటవి).

(ii) ఉద్యోగము స్వతంత్రమా? ప్రయివేటు ఉద్యోగమా, పబ్లికు ఉద్యోగమా? (దేశము, రాష్ట్రము, జిల్లా, మ్యునిసిపాలిటీ, మత సంఘము, కులసంఘము మొద.)

15. నీవు పాఠశాలలో గాని, విశ్వవిద్యాలయములోగాని నీవృత్తికి సంబంధించిన అనుభవమును సంపాదించినావా? ఎంతకాలము? ఎట్టి అ

నుభవమును సంపాదించినావు?

16. నీకిప్పుడు ఏదయినా ఖాయము ఉద్యోగముకాని, ఖాయముకాని ఉద్యోగముకాని ఉన్నదా? ఆఉద్యోగము స్వభావమెట్టిది?

17. క్రిందటి "టెర్మ్లో" ఏదయినా ఉద్యోగము చేసినావా? ఏఉద్యోగము చేసినావు? ఈ ఉద్యోగము వల్ల నీవు సంపాదించిన సొమ్ము నీ యిప్పటి చదువుకు ఎంతవరకు సరిపోతుంది?

... ... ...

ఇటువంటి ఫారము నింపి, ఆఫీసు గుమాస్తా వద్దకుపోయి, తన ఎబిట్యూరియెంటెన్ సర్టిఫికేటును చూపి, జీతము చెల్లించవలెను. ఇదంతా కొన్ని నిమిషములు మాత్రము పట్టుతుంది. పరదేశ విద్యార్థులు "డక్కాన్" వద్దకు పోవలెను. ఇతడు పరదేశ విద్యాలయాలవా రిచ్చిన పట్టాలు తనిఖీచేసి తన విశ్వవిద్యాలయములో చేరడానికి విద్యార్థికి హక్కున్నదో లేదో చూచుకొంటాడు.

విద్యా పద్ధతి.

ఇండియాలోని విద్యాలయాలలోవలె జర్మ

ను విశ్వవిద్యాలయాలలో విద్యార్థులను మొదటి సంవత్సరము క్లాసు, రెండో క్లాసు, అని ఈమో స్త రుగా వేర్వేరుగా విడదీయరు. చదువంతా అ యిన తరువాత అంతమందు జరిగే ఒక్క పరీక్ష తప్ప మరేవి పరీక్షలు జరగవు. ఈవిద్యార్థులు ఈ "ట్యూటరు" క్రింద ఉండవలెననే పద్ధతి లేదు. ఉపన్యాసాలపట్టికను ప్రకటిస్తారు. వాటిలో విద్యార్థికి ఏ ఉపన్యాసాలు ఇష్టమయితే వాటికి పోయి వినవచ్చును. ఏ ఉపన్యాసాలు వింటే మంచిదో సలహా ఇవ్వడానికి ప్రత్యేకముగా ఉ ద్యోగస్థుడెవ్వడున్ను ఉండడు. ప్రతి విద్యార్థి వద్దను ఒక ఉపన్యాసాలు వ్రాసుకొనే పుస్తక ముంటుంది. దీనిలో విద్యార్థి ఏ ఉపన్యాసాలను ఎం చుకొని, జీతము చెల్లించినాడో, ఆఫీసు గుమా స్తా వ్రాస్తాడు. "బుక్కు" ఆరంభమున, ఆఖరున, ఇందులో అధ్యాపకుడు సంతకము చేయవలెను. అతడు సంతకము చేయడానికి విద్యార్థి ఏ ఉపన్యా సమును వినవలెననే నియమములేదు, ఒక్క ఉపన్యాసమునైనా వినకుండానే పట్టాను సంపాదిం

చవచ్చును.

జర్మనీలో ఉపన్యాసము ఎప్పుడారంభమవు తుందో తెలియజేసిన వేళకు 15 నిమిషముల తరువాత అధ్యాపకుడు ఉపన్యాసము నారంభిస్తాడు. ఈ గడువుకు "ఎకెడెమిష్ ఫీర్టెల్" (Academische Viertel) అనిపేరు. కొన్ని సమయములలో ఈ గడవు ఉండదు. గడువు ఉన్నదీ లేనిదీ స్పష్టముగా తెలియ జేస్తారు.

చదువు (1) కలోక్వియమ్ (Colloquium) (2) సెమినార్ (Seminar) (3) గెసెల్ షాఫ్ట్ (Gesselechaft) అనే మూడువ్యవస్థలాలలో జరుగుతుంది. కలోక్వియములో విశేషజ్ఞానము నిచ్చే ప్రియివేటు వ్యాఖ్యను ఇస్తారు. ఒక విషయమును ముందుగా నిశ్చయించుకొని, అనేక విద్యార్థులిక్కడ అధ్యాపకుని కలుసుకొంటారు. ఇవ్వి పబ్లికు క్లాసులుకావు. వీటికి పోవడానికి జీతము చెల్లించ నక్కరలేదు. ఆయా అధ్యాపకుని అనుమతితీసుకొని ఏవిద్యార్థి అయినా ఈ క్లాసులకు పోవచ్చును. ప్రతి ఉపాధ్యాయుడున్ను వారము

నకు ఒక సారి అయినా ఇంటువంటి క్లాసు పెట్టుతాడు.

సెమినారులో పబ్లికు క్లాసులు జరుగుతవి. వీటిలో ఒక రిద్దరు విద్యార్థులు ముందుగా తెలియ జేసిన విషయాల మీద వ్యాసాలు వ్రాసి చదవ డమో, కొన్ని నిశ్చితవిషయాలను గురించి ఉప న్యాసాలు చేయడమో జరుగుతుంది. వారు వ్యాసము చదవడముగాని, ఉపన్యాసము చేయడ ముగాని అయిన తరువాత అందరూకలిసి ఆ విష యమును గురించి చర్చిస్తారు. ఈ చర్చలో అ ధ్యాపకుడు సహాయ పడుతూ ఉంటాడు. ఒక సెమినారలో ఇద్దరు ముగ్గురు అధ్యాపకులు కూడా కలిసి సహాయము చేయడమున్ను కలదు. సె మినారు ఉపన్యాసాలకు పూర్వము ఆవిషయమును గురించిన చరిత్రమును, దాని మీద ఉండే పుస్త కములను ఆలోచిస్తారు. ఒకకొన్ని చదువు, ముం దుగా నిర్ణీతమయిన విషయమును గురించే అయి ఉంటుంది.

"గాసెల్ షాప్ట్" అనేది ఒక విషయమును

గురించిన జ్ఞానమును అభివృద్ధి చేయడానికి ఏర్పడిన సంఘము. ఈ సంఘము సాధారణముగా వారమున కొకసారు కలస్తుంది. ఒక ఆవిషయము ను బోధించే ఉపాధ్యాయులందరున్ను ఈసభలకు వస్తారు. విద్యార్థులలో ఎక్కువ అనుభవము గలవానిని కూడా ఈసభలకు ఆహ్వానిస్తారు. మొదటి అరగంట, గడచిన వారములో ఆ విషయము నుగురించి బయలుదేరిన పుస్తకాలు, వ్యాసాలు, మొదలయిన వాటిని గురించి చర్చజరుగుతుంది. ఒక కొత్త పుస్తకముగాని, ముఖ్యమైన వ్యాస ముగాని ఉంటే, దానినిచదివి, దానిమీద తన అభిప్రాయమును మరుచటి సభలో తెలియచేయ వలసినదని, ఒక ఉపాధ్యాయుని గాని, అనుభవ ముగల విద్యార్థినికాని అడుగుతారు. ఇందువల్ల జర్మనీలోను, ఇతర దేశాలలోను, ఒక విషయమై జరుగు ఉన్న అభివృద్ధిఅంతా ఇక్కడివారికి తెలుస్తూ ఉంటుంది. రెండో అరగంటను వ్యాస ములను చదివి, వాటిమీద చర్చచేయడానికి విని యోగిస్తారు. సెమినారులో చదివే వ్యాసాల

కంటె, ఈ వ్యాసాలు ఎక్కువ ముఖ్యమయినవిగా ఉంటవి. ఈ మీటింగయిన తరువాత సభ్యులందరూ ఒక అల్పాహారగృహములో కలుస్తారు.

పాఠక్రమము.

ఈ గంటలలో ఈ ఉపన్యాసాలు జరుగుత వి అని ఎవరున్నూ టైము టేబిలు ఏర్పాటు చేయరు. రాబోయే "టర్ము"లో ఏ విషయమును గురించి ఉపన్యాసా లివ్వదలచినదిన్ని ప్రతి ఉపాధ్యాయు డున్ను తెలుపుతాడు. ఒక శాఖలోని పెద్ద అధ్యాపకుడు ఒక ఉపాధ్యాయునిచేత ఎప్పుడే ఉప న్యాసము జరిగేదిన్ని ఏర్పాటు చేయిస్తాడు. ఒక ఉపన్యాసము జరిగే గంటలో మరి ఒక ఉపన్యాస ము కూడా జరుగకుండా మాత్రము ఆ ఉపాధ్యా యుడు చూడవలెను.

వసతి.

విద్యార్థుల వసతులమీద విశ్వవిద్యాలయ మువారికి ఎట్టి అధికారమున్ను లేదు. విద్యార్థు లకు ప్రత్యేక వసతిగృహములు (Hostels) లేవు. వారు తమ ఇష్టము వచ్చిన ఇంటిలో ఉండవచ్చును.

తమ కిష్టము వచ్చినపని చేసుకోవచ్చును. వారి స్వాతంత్ర్యమునకు ఎట్టి నిర్బంధమున్ను కలుగజేయరు. విద్యార్థులకు అద్దెలకు గదులివ్వడాని కిష్టపడే కుటుంబములవారి పట్టీని తయారు చేయడానికి పీడల్ (Pedal) అనే ఒక ఉద్యోగి ఉంటాడు. పరదేశవిద్యార్థులకు ఇదివంటి సదుపాయము. ఈ సదుపాయము లండనులోగాని, ఇంగ్లాండులోని వసతివిద్యాలయాలలోకాని, ఇతర విశ్వవిద్యాలయాలలోగాని లేదు. విద్యార్థులు సరియైన వసతిని సంపాదించుకొనడానికి అక్కడ చాలా ఇబ్బందిపడతారు. నిద్రపోవడానికిన్ని, చదువుకొనడానికిన్ని ఒక్కటే గదినిగాని, వేరుగదులనుగాని విద్యార్థులు అద్దెకు తీసుకొనవచ్చును. జర్మనువిద్యార్థులు మధ్యాహ్న భోజనమును ఏదయినా హోటేలులో చేస్తారు. రాత్రిభోజనముకోసము ఇంటినుంచి తెప్పించుకొంటారు. జర్మనుభాషరాని పరదేశ విద్యార్థులు భోజనసదుపాయములుగల గదులను ఏర్పాటుచేసుకోవడమే మంచిది. ఇప్పుడు విద్యార్థుల సహాకారభోజనశాలలను ఏర్పాటు చే

సుకొన్నారు. వీటిలో అంత ఎక్కువ ఖర్చు కాదు.

వసతి, ఉపన్యాసములకు పోవడము, ఇతర పనులు—వీటి విషయములో ఇతర దేశములలో కంటె జర్మనీలో విద్యార్థులకు ఎక్కువ స్వాతంత్ర్యమున్నది. విశ్వవిద్యాలయమువారు ఎట్టి నిర్బంధమున్ను చేయరు. మొన్న మొన్నటివరకున్ను, దేశచట్టములను అతిక్రమించిన విద్యార్థిని గవర్నమెంటు మేజస్ట్రేటు విచారించేవాడు కాడు. పోలీసువారు ఆ విద్యార్థిని పట్టుకొని అతడా కళాశాలవాడే అని రుజువుచేస్తే విశ్వవిద్యాలయాధికారికి ఒప్పగించేవారు. యూనివర్సిటీ మేజస్ట్రేటే ఆ కేసును విచారించేవాడు. ఇప్పుడీ విద్యార్థుల హక్కును తీసివేసినారు. కాని, విద్యార్థి నేరము చేసినప్పుడు అతనిని ఎరెస్టు చేసిన సంగతిని విశ్వవిద్యాలయాధికారులకు తెలుపుతారు. అతని పక్షమున వాదించడానికి విద్యాలయాధికారులు తగిన సదుపాయములు చేయవచ్చును.

### విద్యార్థుల జీవనము.

ఇంగ్లాండులో విశ్వవిద్యాలయాలలోని క్రిం

ది తరగతులలో ఉండే విద్యార్థులకు అతిముఖ్య ములయిన "విద్యార్థుల సంఘములు" జర్మనీలో లేవు. కాని, ప్రతివిశ్వవిద్యాలయానికిన్ని ఒక పఠనాలయముంటుంది. దీనితో ఒక గ్రంథాల యముకూడా చేరిఉంటుంది. పఠనాలయమును చూడడానికి సగముమంది విద్యార్థులున్ను సగము మంది అధ్యాపకులున్ను గల ఒక ఉపసంఘముంటుం ది. వీరిని సభ్యులు ఎన్నుకొంటారు. యుద్ధా నంతరము ఈ పఠనాలయాలకు ఎక్కువ మంది పో తున్నారు. విద్యార్థులకు చర్చాసంఘములు లేవు. చర్చను ఏలాగు సాగించడమో జర్మనువిద్యార్థుల కు తెలియదు. కొంతమంది అధ్యాపకులతో క లసి ఒక అధ్యాపకుడు ఒక చర్చాసంఘమును ఆ రంభించినాడు గాని, వివాదగ్రస్తములయిన రాజ కీయవిషయములపై అందరున్ను ఏకారణముగా ఏకాభిప్రాయమునకు రాలేకపోవడముచేత, ఈ ప్రయత్నమును మానుకొన్నారు.

కాని, మరిఒక విధమైన విద్యార్థిసంఘము లున్నవి. ఇవి రెండు విధములుగా ఉంటవి.

కొన్ని ఒకరితో ఒకరు కలిసి పరిచయము కలిగించుకొనడమునకున్ను, కొన్ని ఇట్టి పరిచయమే కాకుండా శాస్త్రవిషయాలను, సాహిత్యవిషయాలను చర్చించుకొనడమునకున్ను ఏర్పాటయి ఉంటవి. రెండోతరగతి సంఘములు గణితము, వేదాంతము, చరిత్రము, మొదలయిన విషయాలనుబట్టి వేర్వేరుగా ఉంటవి. ఈసంఘములకు ఒక అధ్యక్షుడు, ఒక కార్యదర్శి, ఒక అలంకారకార్యదర్శి, ఒక కోశాధిపతి ఉంటారు. వీరిని విద్యార్థులే ఎన్నుకొంటారు. వీరు ఒక్క టెర్ము మాత్రమే ఆ ఉద్యోగములో ఉంటారు. జర్మను విశ్వవిద్యాలయములో నవంబరు ఆరంభమునుంచి ఈస్టరువరకు ఒకటిన్ని, మే నెల మొదలు ఆగస్టు మధ్యవరకు ఒకటిన్ని రెండే టెర్ములుంటవి. మొదటి రెండు సంవత్సరముల విద్యార్థులచేత పై సంవత్సరముల విద్యార్థులు పనులను చేయించుకొంటారు. ఈ క్రింది విద్యార్థులకు "ఫూక్స్" (Fuchs) అనిపేరు. వారానికి ఒక సభ జరుగుతుంది. అందులో ఒక విద్యార్థి తప్పకుండా ఒక వ్యాసమును చదువు

తాడు. కొన్ని పర్వదినాలలో అధ్యాపకులను కూడా విద్యార్థులసభలకు పిలుస్తారు. వారున్ను వ్యాసాలు చదువుతారు. ఆవ్యాసముమీద శాస్త్రీయచర్చ జరిగినతరువాత అందరున్ను అల్పాహారాలకు చేరుతారు. ఈవిందు తెల్లవారుజాము మూడు నాలుగు గంటలవరకున్ను జరుగుతుంది. విద్యార్థులు పాటలుపాడుతారు. హాస్యోపన్యాసాలు చేస్తారు. కాని, వారందరున్ను చాలకాలము "బీరు" సారాయమును త్రాగడముతో గడుపుతారు. జర్మనువిద్యార్థి బీరు త్రాగడము విషయమై అనేకకథ లున్నవి. ఒకొక్కడు గంటకు 48 పెద్ద గ్లాసుల సారాయము కూడా త్రాగగలడట. ఆతరువాత గంటకు ఎనిమిది గ్లాసుల చొప్పున మరినాలుగుగంటలు కూడా త్రాగగలడట.

ఈసంఘముల సభకు "క్నీపె" (Kneipe) అనిపేరు. ఇందులో ఒకరితో ఒకరు చేతులు కలుపుకొని పరిచయము కలుగజేసుకోరు. ఒకరి ఆరోగ్యముకోసము ఒకరు "బీరు" త్రాగి పరిచ

యము కలుగజేసుకొంటారు. ఇద్దరున్ను గ్లాసులను "బీరు"తోనింపి "ఒకటి, రెండు, మూడు" అని ఒక్కగుటకలో తాగివేస్తారు. ఇట్లు తాగుతే వారి సౌహార్దము వెల్లడిఅవుతుందట. ఒకొక్కప్పుడు వారిద్దరికి పరిచయము కలుగజేసే మూడోవాడు మధ్యను నిలబడి "ఒకటి, రెండు మూడు, పాసిట్ (ఆరోగ్యము)" అంటాడు. అప్పుడు వారిద్దరున్ను గ్లాసులను టేబిలుమీద చప్పుడుచేసి "ఒకటి, రెండు, మూడు, పాసిట్ (ఆరోగ్యము)" అని తాగివేస్తారు. ఎవరు ముందర తాగివేస్తే వారు గెలిచినట్లు. పేదరికముచేత చాలమంది విద్యార్థులు ఎక్కువగా తాగడము అలవాటు చేసుకోరు. ఈ సంఘములవారు టెర్ములో అధ్యాపకులుచేసిన ఉపన్యాసాల సారాంశమును వ్రాసిన రిపోర్టు ఒకటి ప్రకటిస్తారు. దీని ప్రతులను ప్రాచీనవిద్యార్థుల కందరికిన్ని పంపుతారు. ఈ ప్రాచీనవిద్యార్థులకు "అల్టెహెర్" (Alte Herr) (ముసలిపెద్దమనుష్యులు) అనిపేరు. వీరిని ఆయా సంఘాల ముఖ్యసభలకున్ను విందు

లకున్న పిలుస్తారు. కొన్ని సంఘాలలో ఈపాత్రి విద్యార్థులు ఒక విధమైన దుస్తులను ధరించవలసి ఉంటుంది. వారానికొకసారి జరిగే సభలకే కాకుండా, "బీరు" త్రాగడానికి విద్యార్థులు కలుస్తూ, ఒకే హూటేలులో భోజనము చేస్తారు. ఆదివారాలలో విహారాలకు పోతారు. జర్మను విద్యార్థి ఉదయము ఆరుగంటలకు బయలుదేరి రాత్రి పదిగంటలవరకున్న ఒక్క-బిగిని నడవగలడట. రోజుకు ఏభై మైళ్ళు నడవగలడట.

జర్మను విశ్వవిద్యాలయములోని విద్యార్థులు ఒక్క-విశ్వవిద్యాలయమునే అంటిపెట్టుకొని ఉండరనిన్నీ, ఒకదానిలోనుంచి మరిఒకదానిలోనికి తిరుగుతూ ఉంటారనిన్నీ, ఇంతకుముందు తెలుపబడ్డది. సరాసరిగా ఒకవిశ్వవిద్యాలయములోనే చదివిన విద్యార్థి కనేబడడు. రెండువిద్యాలయాలలో మాత్రము చదివినవారు బహుఅరుదు. చాల మంది ఒకదాని తరువాత మరిఒకటిగా మూడు నాలుగింటినయినా చూస్తారు. ఒకవిశ్వవిద్యాలయములో ఏయే సంఘాలు ఉంటవో, మరిఒకదానిలో కూ

డా ఆసంఘాలే ఉంటవి ఒకవిశ్వవిద్యాలయములో చరిత్రసంఘములో ఉండే విద్యార్థి. తానుపోయి న క్రొత్త విశ్వవిద్యాలయములో దానికి సరిపో యే చరిత్రసంఘములో వెంటనే చేరడానికి వీ ళ్ళున్నది. అతను ఎక్కువ ఇంత అని చెల్లించి ఈ సంఘము లో సభ్యుడుకావచ్చును. లేదా, ఏ మీ చెల్లించనక్కరలేకుండా గౌరవసభ్యుడుగా అయినా ఉండవచ్చును. ఒకసంఘములోని సభ్యు లు ఒకరినొకరు చనువుగా "అన్నా, తమ్ముడూ" అని పిలుచు కొంటారు.

ఇండియాలో ఉండే క్రికెట్టు, ఫుట్ బాల్, హాకీ సంఘములు జర్మనీలో లేవు కాని, యు ద్ధానంతరము వ్యాయామక్రీడలమీద ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నారు జర్మ విద్యార్థుల సంప్ర దాయమునకు ఈ ఆటలు సరిపడవు. కాని, అం దరున్ను టెన్నిసు ఆడుతారు. కసరత్తుచేస్తారు. ఈ ఆటలులేకపోవడమనే లోపము సంఘాలలో తీరిపోతుంది. ఈ సంఘాలు ఒకొక్క రాష్ట్రము విద్యార్థులుకలిసి ఏర్పాటుచేసుకొంటారు. జర్మను

సామ్రాజ్యము అనే అభిప్రాయము ప్రబలినకొద్దీ సామ్రాజ్య భక్తియే ఆధారముగా ఈ సంఘములు ఏర్పడుతున్నవి. అంతకంతకున్ను ఆటల మీద ఆసక్తిపుట్టి, అది ఎక్కటిపోరులలోనికి పరిణమించినది.

ప్రస్తుత మీసంఘాలు కొంతవరకు అల్పాహారాలకోసమున్ను, కొంతవరకు ఆటలకోసమున్ను ఏర్పడి ఉన్నవి. విద్యార్థులు "క్లీపె" సభలలో చేరి పాటలుపాడుకొంటూ, హాస్యోపన్యాసాలు చేస్తూ, విహారాలకు పోతూఉంటారు. సభ్యులందరున్ను కలిసి ప్రత్యేకగృహాలలో భోజనాలు చేస్తారు. కాని, ఎక్కటిపోరు చేయడమే ఈ సంఘాల ముఖ్యోద్దేశము. ఈపోరు,ముష్టియుద్ధమును (Boxing) పోలి ఉంటుంది. దీనిలో పిడికిళ్ళకు బదులుగా వాడికత్తులను ఉపయోగిస్తారు. పోరు జరిగేటప్పుడు గాయములకు కట్లుకట్టడానికి ఒక వైద్యుడు తప్పకుండా ఉంటాడు. టెన్నిసు, ముష్టియుద్ధములవలె, ఎక్కటిపోరులు స్నేహముగానే జరుగుతవి. ఏడెనిమిది సంఘాల అధ్యక్షులు వారాని కొకసారి

కూడి, తమతమ సంఘాలసభ్యులలో ఈ పోరులను ఏర్పాటు చేస్తారు. క్రొత్తగా సంఘములో చేరిన విద్యార్థి, ఒక పోరులో జయముపొందే వరకు "ఫ్లాక్సు" గానే ఉంటారుగాని, పెద్దసభ్యులు "బుర్ష్" (Bursch) కాజాలరు. ఈ పోరులలో చాలావాటిని సంఘాల అధ్యక్షులే ఏర్పాటు చేస్తారు, కాని, విద్యార్థులలో ఇద్దరికి పెద్దతగవు పుట్టుతే, వారు ఎక్కటిపోరు చేసి తమ తగవు తీర్చుకొంటారు. ఈ ఎక్కటిపోరుకు చాలా ఖర్చవుతుంది గనుక ఎపరో ధనవంతుల బిడ్డలే వీటిలో చేరుతారు. సభ్యులందరి మొగాలమీదను కత్తిపోట్ల మచ్చలుంటవి. ఈ మచ్చలు మగవారి అందమునకు లక్షణమని అనుకొంటారు. జర్మనీదేశములో శాస్త్రపరిశోధనవిహారములు విద్యార్థి జీవనములో ముఖ్యములు. ఈ విహారాలను అధ్యాపకులు ఏర్పాటు చేసి, విద్యార్థులను కార్మికప్రాముఖ్యముగల పట్టణములకు తమతో తీసుకొనిపోయి, ఆయా పరిశ్రమను గురించి వివరముగా తెలుపుతారు.

---

## అధ్యాయము ౧౨.

### పెద్ద పట్టణములలో విద్యార్థులవసతులు.

విద్యార్థులకు తగిన బసలను ఏర్పాటు చేయడమువిషయములో ప్రతి పెద్దపట్టణములోను కష్టము లుంటవి. ఇంగ్లాండు దేశములో కొన్ని పట్టణములలో విద్యార్థులకు కొన్ని వసతిగృహములను ఏర్పాటుచేసినారు గాని, వీటిలో స్థలము బొత్తిగా చాలకుండా ఉన్నది. జర్మనీలో విద్యార్థులకోసము గృహములు కొన్ని కట్టినారుగాని ఇవి మీటింగులు చేసుకొనే విద్యార్థిసంఘములుగా ఉన్నవిగాని, వసతిగృహములుగా తగిఉండలేదు. విద్యార్థులకు ఎక్కువ ఖర్చుకావడము, వారివసతులు అనారోగ్యముగా ఉండడము, సరియైన వ్యాయామముగాని సహవాసముగాని లేకపోవడము—ఇవన్నీ ప్రతిపెద్దపట్టణములోను ఉండేవే. కలకత్తాలో ఈసమస్య చాలాక్లిష్టముగా ఉన్నది. ఇప్పటికిన్ని ఈకష్టాలను తొలగించడానికి తగిన ప్రయత్నాలు జరగలేదు. యూరోపు దేశములోవలె ఇండియాలో కుటుంబీకులు

పై విద్యార్థులను తమ కుటుంబాలలో చేరనివ్వరు. యూరోపు ఖండములో కుటుంబీకులు విద్యార్థులను చేర్చుకొని, వారికి తమ నౌకరులు పనిచేస్తే ఊరు కొంటారు. ప్రేగు (Prague) పట్టణములో విద్యార్థుల వసతులకోసము క్రొత్తగా ఏర్పాటు జరిగినది. జెక్కులకున్ను జర్మనులకున్ను భాషా భేదములవల్లను సంప్రదాయభేదములవల్లను సరి పడదు. అందుచేత ఆపట్టణములో జెక్కువిద్యార్థుల కొరకు వసతిగృహమున్ను, జర్మను విద్యార్థుల కొకటిన్ని కట్టినారు. ఉన్నత పాఠశాలలకంటె పై తరగతులలో చదువుకొనే విద్యార్థులందరున్ను ఈ వసతిగృహములలో ఉండవచ్చును. ఈ రెండు వసతిగృహములలోను ఒకటి ఈక్రింద వర్ణింపబడినది.

ఈహాస్టలును స్థాపించినది ఒక ప్రయివేటు కమిటీవారు. ఈ కమిటీలో జెకో-స్లోవేకియా రిపబ్లికు అధ్యక్షుడు నియమించిన ఒకడున్ను, ఆదేశము మంత్రులు ఐదుగురు నియమించిన అయిదుగురున్ను, ప్రేగు పురపాలక సంఘమువారు నియ

మించిన ఒకమున్ను, విద్యార్థులే ఎంచుకొన్న ఒక రున్ను, మొత్తము ఎనమండుగురు సభ్యులున్నారు. దీనికి ప్రభుత్వమువారు సంవత్సరమునకు 2,000 పౌనులు గ్రాంటు ఇస్తారు. ఇల్లుకట్టుకొనడానికి పురపాలక సంఘమువారు ఉచితముగా స్థలమిచ్చినారు. ఇల్లుకట్టడమునకయిన మొత్తము సొమ్ములో రెండువంతులు ప్రభుత్వము వారిచ్చినారు. తక్కినవంతు కమిటీవారు చందాలమీద వసూలుచేసినారు. దీనిలో 800 మంది విద్యార్థులకు వసతిఉన్నది. విద్యార్థికి ఖర్చు మోతాదుగా ఉన్నది. ఒకొక్కనికి నెలకు బసకు భోజనమునకు 2 పౌనులనుంచి 5 పౌనులవుతుంది. పిల్లల తలిదండ్రుల స్థితిగతులను బట్టి ఇచ్చుకోవలసిన సొమ్ము భేదిస్తూఉంటుంది. నూటికి 50 మందిని తక్కువ సొమ్మును చేర్చుకొంటారు. నూటికి 20 మంది నెలకు 2 పౌనులు మాత్రమే చెల్లిస్తారు. గదులన్నీ ఒకటేరకముగా ఉంటవి; భోజనము కూడా ఒక్కటే. ఈహాస్టలు విశ్వవిద్యాలయమునుంచి అయిదు మైళ్ళదూరములో ఉన్నది. కాని, ఇ

క్కడనుంచి ట్రాముబండ్లు పోతవి. విద్యార్థులకు ట్రాముటికెట్లు తక్కువ ఖరీదుకిస్తారు. గదికి ఇద్దరు విద్యార్థులుంటారు. కాని ప్రత్యేక పరీక్షలకు చదువుకోవలసి ఉన్న విద్యార్థులకు ఒకొక్కరికి ఒకగది యిస్తారు. కుర్చీలు, బల్లలు, అలమరాలు, మంచాలు, పరుపులు, హాస్టలువారే ఇస్తారు. విద్యార్థులు పుస్తకాలు, బట్టలు మాత్రము తెచ్చుకోవలెను. ఈ హాస్టలుమీంది అధికారి ఎల్లప్పుడు దాసని కనిపెట్టుకొని ఉంటాడు. ఇతడు పూర్వము విశ్వవిద్యాలయములో అధ్యాపకుడుగా ఉండేవాడు. హాస్టలులో ఒక పఠనాలయము, చదువుకొనే గదులు, పెద్ద భోజనచావడి, 1500 మంది కూర్చొనడానికి చాలిన పెద్దహాలు ఉన్నవి. ఈ హాలులో నాటకములు ఆడుతారు.

---

## అధ్యాయము ౧౩.

### జర్మను విద్యార్థుల సహకార సంఘము.

చాలామంది జర్మనువిద్యార్థులు యుద్ధసమయములో చదువుమాని యుద్ధములో సైనికులుగా ప్రవేశించినారు. యుద్ధ మంతము కాగానే ఈ విద్యార్థులు తిరిగి చదువుకొనడానికి తగిన ధనసామర్థ్యము లేకపోయినది. ఇంగ్లాండులో, కూడా ఈ సమస్య వచ్చినదికాని, ప్రభుత్వము వారున్ను విశ్వవిద్యాలయాలవారున్ను విద్యార్థులకు సహాయపడినారు. యుద్ధమునుంచి తిరిగి వచ్చిన విద్యార్థులకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు ప్రత్యేక విద్యార్థివేతనము లిచ్చినారు; విశ్వవిద్యాలవారు సంఖ్యతో నిమిత్తము లేకుండా వచ్చినవారి కందరికిన్ని ప్రవేశమిచ్చి, సాధ్యమయినంత మట్టుకు సహాయముచేసి, శీఘ్రకాలములో వారివారి పట్టములను సంపాదించుకొనగలిగినట్లు పాఠక్రమమును, పరీక్షలను మార్చినారు. కాని జర్మను ప్రభుత్వమువారికి విద్యార్థులకు సహాయము చేయడానికి డబ్బు లేకపోయినది. విశ్వవిద్యా

లయాలకు మూలధనము లేక పోవడము చేతను అవి కూడా ప్రభుత్వము మీదనే ఆధారపడి ఉండడము చేతను, విద్యార్థులకెట్టి సహాయమును చేయజాలకపోయినవి. అందుచేత విద్యార్థులు స్వయంసహాయము చేసుకోవలసివచ్చినది. వారు 1921 సం రము ఫిబ్రవరినెలలో పెద్ద సభ చేసి స్వయంసహాయసంఘము నొకదాని నేర్పాటు చేసుకొన్నారు ఈ సంఘమునకు మూలస్థానము డ్రెస్‌డెస్ (Dresden) పట్టణములోను, దాని శాఖలు ప్రతివిశ్వవిద్యాలయస్థానములోను ఏర్పాటు చేసినారు. 1921 సం॥రలో వారేర్పరుచుకొన్న చిన్నసంఘము, ఇప్పుడెంతో అభివృద్ధి అయి, జర్మనీ దేశములోని ఉన్నతవిశ్వవిద్యాలయ విద్యావ్యాపనము విషయమై ఎంతో పని చేస్తున్నది.

ఈ సంఘమువారు విశ్వవిద్యాలయస్థలాలన్నిటిలో విద్యార్థిగృహములను కట్టడానికి ప్రయత్నిస్తున్నారు. అప్పుడే ఇటువంటివి అయిదు కట్టినారు. ఇతర స్థలాలలో అద్దెలకు ఇళ్ళు పుచ్చు

కొన్నారు. ఈ యిళ్ళు కట్టడానికి చందాలు లే వసెత్తినారు. చందా సొమ్ము కాక ఆసొమ్ములో నూటికి 70 వంతు ప్రభుత్వమువారు కూడా ఇచ్చి నారు. ఈ ఇళ్ళు విశ్వవిద్యాలయసంఘములవలె ఉంటవిగాని, హాస్టలులవలె ఉండవు. ఈయిళ్ళకు అనుబంధించి పెద్ద హాొటేళ్ళుంటవి. వీటిలో చౌకగా అన్నము పెట్టుతారు. మరిఒకచోటి కంటె ఈహాొటేళ్ళలో నూటికి 60 వంతు మాత్రి మిచ్చుకోవలసి ఉంటుంది. మొత్తము వి ద్యార్థులలో మూడోవంతుమంది ఈ యిళ్ళలో బసలు చేసుకొంటారు. ఈ యిళ్ళలో ఉండడ ము వల్లను, వీటి కనుబంధించిన హాొటేళ్ళలో భోజనము చేయడము వల్లను, సంవత్సరానికి వి ద్యార్థులందరూ కలిసి 88,000 పౌనులు మిగుల్చు కొంటారు. ఈ మిగిలిన సొమ్ము పేదవిద్యార్థు లకు సహాయనిధిగా ఏర్పడుతుంది. చాలమంది బీదవిద్యార్థులనుంచి సగము సొమ్ము మాత్రమే తీసుకొంటారు. నూటికి 15 గురు పేదవిద్యార్థు లను ఉచితముగానే చేర్చుకొంటారు. ఉచిత భో

జనమునకయ్యే ఖర్చులను సంఘమువారు హాస్టేళ్ళకు ఇస్తారు. అందుచేత హాస్టేళ్ళమీద సాధారణముగా నష్టమురాదు. సంఘమువారు సహకారపక్రియశాలలను ఏర్పాటు చేసినారు. ఇందులో వస్తువులు కొనడమువల్ల పైని కొను క్కొనడముకంటె నాలుగో వంతు మిగులుతుంది. బట్టలు, జోళ్ళు, మొదలయిన విలువగల వస్తువులను కంపెనీలనుంచి అందరూ కలిసి తెప్పించుకొంటారు. కంపెనీలవారు మంచి డిస్కౌంటు ఇస్తారు. పాతవిద్యార్థులు తమ పాఠపుస్తకాలను ఈ గృహములకు ఉచితముగా ఇస్తారు. వీటిని పేద విద్యార్థులు ఉపయోగించుకొంటారు. చాలామంది విద్యార్థులు ఉపన్యాస సారాంశములను టైపు చేసుకొంటారు. టైపు చేసుకొనడానికి సంఘమువారు టైపుమెషీనులను ఉచితముగా ఎరువిస్తారు. ఈ మెషీనులను విద్యార్థులు తమ గదులకు కూడా తీసుకొనిపోవచ్చును. ఇదిగాక రోగముపడ్డ విద్యార్థులను జర్మనీలోను ఇతర దేశములలోను ఉన్నరోగులను పోషించే గృహముల

కు సంఘమువారే ఖర్చులను భరించివేస్తారు. సెలవులలో పేదవిద్యార్థులకు పనిని కల్పించి, వచ్చే "టెర్ము" ఖర్చులకు సరిపోయేటట్లు సంపాదించుకొనడానికి సదుపాయాలు కూడా సంఘము వారు చేస్తారు. తమ దేశపు విద్యార్థులను ఇతర దేశాలలో పోషించే పద్ధతి మీద పరదేశ విద్యార్థులను వీరు తమ గృహాలలో చేర్చుకొని పోషిస్తారు. తమ దేశపు విద్యార్థులు పరదేశములలో చదువుకొంటే కొంతమందికి సంఘమువారు విద్యార్థివేతనములుకూడా ఇస్తారు. విద్యార్థులకు అప్పులివ్వడమున్నూ, ఉచితముగా డబ్బు ఇవ్వడమున్నూ, కాకుండా వారికి చేబదుళ్ళు కూడా ఇస్తూ ఉంటారు. ఈ చేబదుళ్ళలో నూటికి 40 వంతు తిరిగీ రాదట. ఈ నష్టమును పూర్తిచేయడానికి విశ్వవిద్యాలయములోని ప్రతి విద్యార్థిన్నీ టెర్ముకు 8 పెన్సులు చెల్లిస్తాడు. తమ గృహములోని విద్యార్థులకు ఉద్యోగాలను సంపాదించడానికి సంఘమువారొక శాఖను ఏర్పాటు చేసినారు. ఇది గాక ఇతరదేశ విశ్వవిద్యాలయముల భోగట్టాను

వీరు తెలుపుతూ ఉంటారు. సంఘమువారే కా కుండా గవర్న మెంటువారున్ను పేద విద్యార్థుల కోసము సహాయనిధి నొకదానిని ఏర్పాటు చేసి నారు. ఈ సంఘమువారి సలహాపై "కూరే టరు" సొమ్ము పంచిపెట్టుతాడు.

పైని వివరించిన సదుపాయములన్నీ విదే శీయ విద్యార్థులకుకూడా చేస్తారు. ఈపనులను నిర్వహించడానికి సంఘములో ప్రత్యేక శాఖ ఉన్నది. 1928 సం॥రములో చీనావిద్యార్థుల కోసము వారు విద్యార్థి వేతనములను ఆయా విశ్వ విద్యాలయాలకు పంచిపెట్టినారు. ఈ సదుపా యాలతో విదేశీయ విద్యార్థి నెలకు 10 పౌ నుల మోతాదు ఖర్చుతో కాలక్షేపము చేసుకో గలడు. ఈ సొమ్మయినా డ్రెస్డెను పట్టణములో మూలస్థానమునుంచి అప్పు పుచ్చుకోవచ్చును. విద్యార్థులు రైలుబండ్లలో మూడో తరగతిలో సగము ఛార్జీలమీద ప్రయాణము చేస్తారు. విదేశీయ విద్యార్థులు మొదట నిండు ఛార్జీ చెల్లిం చినా, రైలుస్టేషనులో ఆవిషయమై ఒకకాగితము

పుచ్చుకొని ఉంటే, వారు చెల్లించిన దానిలో సగముసొమ్ము వాపసు ఇచ్చివేస్తారు. విదేశీయ విద్యార్థులు ఫాక్టరీలలో అనుభవమును సంపాదించుకొనడమునకున్నూ, మంచి జర్మను కుటుంబములలో చేరడమునకున్నూ, సెలవులలో తగిన సౌకర్యములు కలగడమునకున్నూ సంఘమువారు ఏర్పాట్లు చేస్తారు.

మూలస్థానము.

పైని విద్యార్థుల సహకారసంఘము పని సాధారణముగా చెప్పబడినది. ఇక మూలస్థానమును గురించి తెలుసుకొందాము. సంఘము మూలస్థానము డ్రెస్డెన్ పట్టణములో ఉన్నది. ఈసంఘములో మూడుతరగతుల సభ్యులుంటారు. (1) జర్మను విశ్వవిద్యాలయములలో మెట్రిక్యులేషను పరీక్ష ప్యాసయిన విద్యార్థులందరున్నూ ఇందులో సభ్యులు కావచ్చును. (2) విద్యార్థులు కానివారు సంవత్సరమునకు 8 షిల్లింగులు చెల్లించి సభ్యులు కావచ్చును (3) వర్తక కంపెనీలవారు సంవత్సరమునకు 5 పౌనులు చెల్లించి సభ్యులుకా

వచ్చును. ఈ సంఘము కార్యనిర్వాహకవర్గములో పండ్రెండుగురు సభ్యులుంటారు. వీరిని సాధారణ సభ్యులు ఎన్నుకొంటారు. వీరిలో నలుగురిని అధ్యాపకులు తమలో తాము ఎన్నుకొంటారు. నలుగురిని విద్యార్థులు తమ వారిని ఎన్నుకొంటారు. తక్కిన నలుగురిని విద్యార్థులు కాని ఇతరసభ్యులు తమలో వారిని ఎన్నుకొంటారు.

(1) అప్పులిచ్చే శాఖ.

(2) విద్యార్థులకు ప్రత్యేక ప్రత్యేకముగా సహాయము చేసే శాఖ.

(3) విద్యార్థి వేతనముల నిచ్చే శాఖ.

(4) స్వదేశ విద్యార్థులను పరదేశములకు పంపించి, వారిస్థానే పరదేశవిద్యార్థులను రప్పించే శాఖ.

(5) సంఘము పనిని మొత్తముమీద సాగించే శాఖ.

(6) సంఘమును గురించి ప్రకటనలను చేసి దానిని అభివృద్ధి పొందించేశాఖ.

అనే శాఖలతో సంఘము పనిచేస్తుంది.

దీనిలో మొదటిశాఖపని విద్యార్థులకు అప్పులివ్వడము. దీని కోసము సంఘమువారికి ప్రభుత్వమువారు సంవత్సరమునకు 800,000 పౌను లిస్తారు. దీనిలో రెండువంతులు మూలప్రభుత్వమువారున్ను, ఒకవంతు రాష్ట్రీయ ప్రభుత్వము వారున్ను ఇస్తారు. ఈ గ్రాంటును పది సంవత్సరములవరకున్ను ఇవ్వడమునకున్ను, ఆతరువాత ఆ 80 లక్షలపౌనులను మూలధనముగా చేసుకొని, సంఘము తనపనిని సాగించుకొనడమునకున్ను ఏర్పాటు జరిగినది. విద్యార్థులు తీసుకొన్నసొమ్ము ఇచ్చివేస్తే, దానిని తిరిగి అప్పు లిస్తూఉంటారు. జర్మనీలో బ్యాంకులలో నూటికి 8 చొప్పున వడ్డీ ఉన్నా, సంఘమువారు 5 చొప్పుననే అప్పులిస్తారు. ఈ పద్ధతివల్ల నష్టము రాకుండా ఉండడమునకు, అప్పు కావలసిన విద్యార్థి చెల్లించక పోతే తనకు బదులుగా చెల్లించడానికి ఒక పెద్ద మనుష్యుని జామీనుగా ఇవ్వవలెను. విద్యార్థులు కొందరు వృత్తినొందుటవల్లను, చదువయిన తరువాత విద్యార్థులకు పనిదొరకక పోవడమువల్లను, కొన్ని అప్పు

లు వసూలు కావు. అట్టి నష్టమును పూర్తి చేయడానికి జర్మనీలోని 49 విశ్వవిద్యాలయముల లోను చదువుకొంటూ ఉన్న ప్రతివిద్యార్థిన్నీ ఏటేటా 15 పెన్నీలు చెల్లించవలెను. విదేశీయ విద్యార్థులకిచ్చే అప్పులు వాపసు కావడము ఎక్కువగనుక విదేశీయవిద్యార్థులు ఏటేటా 4 షిల్లింగుల 6 పెన్నీలు వసూలుచేయడానికి ఆలోచిస్తున్నారు.

విద్యార్థులకు ప్రత్యేకప్రత్యేకముగా సహాయముచేసే రెండో శాఖలో అనేక భాగములున్నవి. వాటిలో ముఖ్యమైనది రోగిష్ఠివిద్యార్థులను ఆరోగ్యస్థలములకు పంపించేది. జర్మనీలోను, ఇతరదేశములలోను ఉన్న ఆరోగ్యస్థలాలకు సంవత్సరమునకు 200 మంది విద్యార్థులను సంఘమువారు పంపించి, వారికయ్యే ఖర్చంతా తామే భరిస్తారు. ఈశాఖలోని విదేశీయభాగము చాలా మంచిపని చేస్తున్నది. అంతర్విశ్వవిద్యాలయ సభలకు ఈశాఖవారు సభ్యులను పంపుతారు. ఇతరదేశాల అధ్యాపకులను ఆహ్వానము చేసి,

జర్మను విశ్వవిద్యాలయాలలో ఉపన్యాసా లిప్పి స్తారు. ఈ అధ్యాపకుల ప్రయాణఖర్చులను సంఘమువారుభరించి, వారిని బాగుగ సత్కరించి, ఉపన్యాసాలకు ఏర్పాటు చేసిన టిక్కట్లసొమ్ము లో కొంతభాగ మిచ్చివేస్తారు. జర్మను విద్యార్థులకు అమెరికాలోని ఫాక్టోరీలలోను అమెరికా విద్యార్థులకు జర్మనఫాక్టోరీలలోను అనుభవము కోసము ఏర్పాట్లు చేస్తారు. జర్మనువిశ్వవిద్యాలయాలలో చదువదలచే విద్యార్థులకు విద్యార్థి వేతనము లిస్తారు. విదేశీయవిద్యార్థులకు జర్మను విశ్వవిద్యాలయాల భోగట్టా తెలుపుతూ ప్రతి సంవత్సరమున్ను ఒక పుస్తకము ప్రకటిస్తారు. ఇండియావిద్యార్థులకు ఈ శాఖవారే విద్యార్థి వేతనము లిస్తారు.

విశ్వవిద్యాలయస్థలములలోని సహకారశాఖలు.

మూలస్థానమునకు ప్రతి విశ్వవిద్యాలయ స్థానములలోను ఒకశాఖ ఉంటుంది. ఈ శాఖకు కూడా ఒక కార్యనిర్వాహకవర్గ మంటుంది. ఇందులో అధ్యాపకులు, విద్యార్థులు, విద్యార్థులు

కాని ఇతరులు, సమాన సంఖ్యగా ఉంటారు. విద్యార్థులుకానివారిని వారికి విద్యార్థులమీద ఉండే అభిమానమును బట్టిగాని, వారు చెల్లించే చందానుబట్టిగాని సభ్యులుగా ఎన్నుకొంటారు. సంఘముయొక్క విశ్వవిద్యాలయశాఖవారు హోటేళ్ళను ఏర్పాటుచేసి, విద్యార్థులకు భోజన టిక్కెట్లను అమ్మడము, పాఠపుస్తకాలను ఎరువివ్వడము, టైపురైటర్లను ఎరువివ్వడము, సెలవులలో విద్యార్థులకు పనికల్పించడము, రోగిష్ఠివిద్యార్థులను జర్మనీలోని ఆరోగ్యస్థలాలకు పంపడము, చేబదుళ్ళివ్వడము, సహకార విక్రియశాలలను ఏర్పాటుచేయడము, మొదలయిన పనులను చేస్తారు. ఒకొక్కశాఖ ఉచితముగాపనిచేసే ఒక విద్యార్థివశమందుంటుంది. ఆయాశాఖలను చూచే విద్యార్థులకు సహాయపడి, ఆఫీసుపని చూడడానికి జీతముమీద ఒక ఉద్యోగికూడా ఉంటాడు. ఈ ఉద్యోగికి సంవత్సరమునకు 120 పౌనులనుంచి 400 పౌనులవరకు జీతమిస్తారు.

ఉపసంఘములుగా పనిచేయడములో జర్మ

నులకు నమ్మకములేదు. ఉపసంఘమువారు మొత్తముమీద చూచుకొంటారు. ప్రత్యేక విషయాలను ప్రత్యేకవ్యక్తులే చూస్తారు. ఈ స్థానిక శాఖలవారిచ్చే విద్యార్థివేతనములు మూలసంఘమువారిచ్చేవాటికంటె వేరుగా కూడా ఉంటవి. వీరుకూడా విద్యార్థులకు చేబదుళ్ళిస్తారు.

విద్యార్థివేతనములు కావలసినవారొక ఫారమును నింపవలెను. దీనిలోని విషయములు సరిగా ఉన్నవో లేవో పోలీసువారు సరిచూస్తారు. ఈ విద్యార్థివేతనములను, ప్రభుత్వమువారును, సంఘమువారును ఇచ్చేఅప్పులను, విదేశీయవిద్యార్థులు కూడా పుచ్చుకోవచ్చును.

ఈశాఖలకు (1) ఒక్కొక్క ప్రతివిద్యార్థి 1½ షిల్లింగుల చొప్పున చెల్లించేసొమ్ము (2) డ్రెస్డెను లోని మూలస్థానము వారిచ్చే సొమ్ము (2) ప్రయివేటు చందాల సొమ్ము (4) విశ్వవిద్యాలయము లోని విద్యార్థికి 2½ పెన్నుల చొప్పున ప్రభుత్వమువారిచ్చే సొమ్ము—ఇదే రాబడి.

ఈసంఘము ఉద్దేశములు, దానిరాబడి,

ఖర్చు, మొదలయిన వాటిని గురించి డైరెక్టరీలోని మూలస్థానమునకుగాని, దాని శాఖలకుగాని వ్రాసి తెలుసుకో వచ్చును.

---

## అధ్యాయము ౧౮.

### జర్మనీలో యువజనసంరంభము.

దక్షిణ ఆఫ్రికాలో జరిగిన బోయరుయుద్ధములో పండ్రెండు, పదమూడేండ్ల బోయరు పిల్లలు యుద్ధముచేయడముచూచి, బేడెను పవెలు (General Baden Powell) అనే ఆయన ఇంగ్లాండులో బాలభటోద్యమమును లేవదీసెను. ఆ ఉద్యమము చల్లచల్లగా బ్రిటిషుసామ్రాజ్యమంతటా ప్రాకిపోయినది. జర్మనులుకూడా, బోయరుల పద్ధతిమీద "ప్ఫాడ్ ఫింటర్" అనే ఒక ఉద్యమమును ఆరంభించినారు (Pfad Finder). ఇప్పుడా ఉద్యమముపేరు "వండెర్న్ ఫోగెల్" (Wandern Vogel). బేడెన్-పవెల్ ఉద్యమము నకు సంఘసేవ, సైనికశిక్షణము అనునవి మూ

లో ధారములు. బేడెన్ పవలే అఖిల బాలభట సేనానాయకుడు. ఈతని ఉద్యమము బాలురు ఏర్పాటు చేసుకొన్నదికాదు. ఇతరులున్ను ఉపాధ్యాయులున్ను ఏర్పాటుచేసినది. జర్మనుల ఉద్యమమునకు శీలసంపాదనము, జాతీయవిద్య, అనేవి మూలాధారములు. ఉద్యమమును ఉపాధ్యాయులతో నిమిత్తములేకుండా విద్యార్థులే ఆరంభించుకొన్నారు. దీనివల్ల విద్యార్థుల చదువుకు భంగము కలుగుతుందని మొదట ఉపాధ్యాయులు ఇది సాగకుండా అడ్డుపడ్డారు. ఈ ఉద్యమానికం తటికిన్ని మూలస్థానమేదిన్ని లేదు. జర్మనీలోని జెకో-స్లోవేకియాలో మాత్రము దీనిని కేంద్రీకరించినారు. జర్మనీలో వేర్వేరు పాఠశాలలవారు సంఘములుగా చేరి, విహారాలకు పోతూ, రాత్రులు ఆరుబయటనే నిద్రపోతారు. ఒక్క వ్యాయామమే కాక, జీవితములోని పలువిధములైన అనుభవమును సంపాదించడమే ఈ ఉద్యమము ఉద్దేశము. పల్లెటూళ్ళలో పిల్లలు సాధారణ వ్యవసాయదారులవలెనే జీవిస్తారు.

యువజనసంరంభములో బాలభటోద్య మము ఒకశాఖ మాత్రమే. అమెరికాలోవలె, జ ర్మనీలోకూడా ప్రపంచ మంతటినీ తెలుసుకోం దామనిన్ని, ప్రపంచములోని విద్యార్థులందరితో ను పరిచయము కలుగజేసుకొందామనిన్ని, కో రికకలిగినది. ఈ ఉద్యమము గృహములలోను బడులలోను విద్యార్థులకుండే అధికనిర్బంధముపై ని తిరుగుబాటని కూడా అనుకోవచ్చును. యుద్ధ మయిన తరువాత, తల్లిదండ్రులు, తమపొట్టకోస ము ఎక్కువకాలము కష్టపడడముతోనే అయిపో యేది. వారే తమపిల్లల చదువులనుగురించి ఆ లోచించడానికి వీలులేకపోయినది. బడిలో చదు వులమీద కాకుండా, సైనికజీవనముమీద ఎ క్కువ నిర్బంధము ఏర్పడినది. ఈ నిర్బంధముల నుంచి తప్పించుకొనడానికే విద్యార్థులీ సంరంభము ను లేవదీసినారు. ఇప్పుడు యువకులు ఆటలు, వ్యాయామక్రీడలు, ఎక్కువగా ఆడుతున్నారు. వీరు బడులఆటలకుపోరు, తామేర్పాటుచేసుకొన్న ఆటలకే పోతారు. వీరి ఆటస్థలములకోసము పృ

రపాలకసంఘములవారు చాలాసొమ్ము ఖర్చుపె ట్టుచున్నారు. 1928 సం॥రములో ఒక్క బెర్లిను పురపాలక సంఘమువారే ఈ విషయమై 600,000 పౌనులు ఖర్చుపెట్టినారు.

జర్మనీలో ఈసంరంభమునకు ఇంకా ఒక ఆకారము ఏర్పడలేదు. దేశనాయకులు దీని మూలముగా జాతీయశీలము నభివృద్ధిచేయడానికి ప్రయత్నిస్తున్నారు.

---

## అధ్యాయము ౧౫.

### కార్మిక విద్య, పారిశ్రామిక విద్య.

ప్రతి ఫాక్టొరీలోను, పెద్ద కార్ఖానాలలోను మూడురకాల పనివాండ్లు కావలసి ఉంటారు.

(1) ఫాక్టొరీ అంతటిని ముత్తముమీద నడిపించేవారు. వీరు యంత్రము లేరీతిగా ఉండవలెనో ఆలోచించి ప్లానులు వేస్తారు. వీరిపని ఉన్నయంత్రములను ఎట్లునడిపించడము అనేది కాదు. ఆయాయంత్రములను ఎట్లుఅభివృద్ధిచేయ

డము అని వా రాలోచిస్తూ ఉంటారు. వీరికి కా ర్ఖానాలో అనుభవము తక్కువగా ఉంటుంది. వీరి పని కాగితాలమీద ప్లానులు వేసుకొని ఆలో చించుతూ ఉండడమే వీరిని "ఇంజనీర్లు" అన వచ్చును.

(2) ఫాక్టొరీలో ఆయాభాగాలను సరి చూచుకొనేవారు వీరికి యంత్రములను నడి పించడము, వాటిని సరిచేయడము, వాటిని మర మ్మత్తులు చేయడము, బాగుగా తెలిసిఉండవలెను. వీరికి "మేస్త్రీలు" "ఓవర్‌సీయర్లు" లేక "ఫోర్ మెన్" అనవచ్చును.

(3) ఏదో ఒక యంత్రముయొక్క చిన్న భాగమును కనిపెట్టుకొని ఉండి, అక్కడిపనినే చేస్తూ ఉండేవారు. వీరు మేధావంతులుగా ఉం డరు. తమపనిని చేసుకొనిపోతూ ఉంటారు. వీరిని కార్మికు లనవచ్చును.

పై మూడువిధములవారున్ను చేసేపను లును వేర్వేరుగాఉంటవి. అందుచేత వారివారికి ప్రత్యేకశిక్షణము నివ్వవలసి ఉంటుంది. ఒక

భవనముకట్టవలె ననుకొందాము. ఇంజనీరు ప్లా నులు గీసి, శ్రమను తగ్గించేయంత్రాలను ఏర్పాటు చేస్తాడు. ఒక ఆర్చిదింపడ మేలాగో, ఆ ఆర్చిలో ఎక్కడ ఎంతబరువుంటుందో ఇంజనీరుకు తెలు స్తుంది. కాని, ఆ ప్లానుప్రకారము ఇటికలను పేర్చడానికి ఒకమేస్త్రి ఉండవలెను. మంచి ఇం జనీరయినవాడు, మంచిమేస్త్రీఅయి ఉండనక్కర లేదు. మేస్త్రి ఎన్నో ఆర్చిలను కట్టి ఉండవచ్చు నుగాని, మరిఒక క్రొత్తరకముఆర్చి కట్టలేడు. మేస్త్రికిక్రింద కొంతమందిపనివాళ్ళుకూడా ఉం డవలెను. వీరు చదువుకొన్నవారైతే తమపనిని మరింత బాగాచేసుకొని తమశ్రమ తగ్గించుకొన డానికి ఉపాయాలు ఆలోచించుకోగలరు. ప్రతి విషయములోను ఇప్పుడు యంత్రములు సహాయ పడుతున్నవి గనుక, ఈపనివాళ్ళు తమపనిలో కుశ లత సంపాదించవలసి ఉంటుంది. అందుచేతనే వీ రికికూడా కార్మికవిద్య అవసరము.

గృహపరిశ్రమలకు ఇంజనీర్లు అక్కర లేదు. మేస్త్రిలు, పనివాళ్ళు, ఉంటేచాలును.

పిల్లెద్దరికి మంచిశిక్షణము కావలెను. వ్యవసాయమునకు సహాయముగా జర్మనీలో ఈమధ్య గృహపరిశ్రమలు మంచిఅభివృద్ధి పొందినవి. యూరోపులో వ్యవసాయము ఏడు నెలలుమాత్రము సాగుతుంది. చాలికాలము అయిదునెలలు వ్యవసాయపుపని ఉండదు. ఆకాలమును వృథాచేయకుండా వ్యవసాయదారులు ఏదో ఒక గృహపరిశ్రమ చేస్తారు. ఈ పరిశ్రమలలో ముఖ్యమయినది పిల్లలఆటవస్తువులను చేయడము. జర్మనులిప్పు డనేకరకాల ఆటవస్తువులను చేస్తున్నారు. ఇవన్నీ వ్యవసాయదారులు చేసేవే. వీటిని చేయడానికి ఇంజనులతో పనిచేసే పెద్దయంత్రాలక్కరలేదు. వీటినిచేసేయంత్రాలను ఒకచోటినుంచి మరిఒకచోటికి మోసుకొనిపోవచ్చును. వీటిని చేతులతోగాని, చిన్న మోటారు ఇంజనులతోగాని నడిపించవచ్చును.

మేస్త్రీ శిక్షణమున్ను, ఒకపరిశ్రమ యజమానుని శిక్షణమున్ను ఒకటేకాకపోయినా, ఒక్కరకమువే. జర్మనీలో ఆయావిధములవారికి

ప్రత్యేకముగా శిక్షణమివ్వడానికి మూడు విధము లైన పాఠశాలలున్నవి. పనివాళ్ళపాఠశాలలకు "గెవెర్బె షూలె" (Gewerbe Schule) అనగా ప్రారంభ కార్మిక పాఠశాలలని పేరు. మేస్త్రీల కున్నూ, పరిశ్రమాధికారులకున్ను శిక్షణమిచ్చే వాటికి "ఫాక్ షూలె" (Foch Schule) అనగా పరిశ్రమ పాఠశాలలని పేరు. ఇంజనీర్లకు శిక్షణ మిచ్చేవాటికి "హోక్ షూలె" (Hoch Schule) అనగా కార్మిక విశ్వవిద్యాలయములని పేరు.

"గెవెర్బె షూలె" (Gewerbe Schule) లేక

"బెరుఫ్ షూలె" (Beruf Schule)

ప్రారంభ కార్మిక పాఠశాలలు.

బాలబాలిక లందరున్ను పధ్నాలుగోయేట బోర్డు పాఠశాలను విడిచిపెట్టగానే ఒకఫాక్టరీలోనో ఒకవృత్తిలోనో ప్రవేశిస్తారు. మొదటివారు మూడేండ్లు వాటిలో పని నేర్చుకోవలెను. ఈకాలములో వారికి జీతమివ్వరు. పనినేర్చుకొంటూ "గెవెర్బె షూలె" (Gewerbe Schule) అనే బడికికూడా పోతూ ఉండవలెను. శాసనము ప్రకారము వా

రీబడికి నిర్బంధముగా పోవలెను. ఈబడిలో తు దిపరీక్ష ప్యాసయితే జీతముమీద చేర్చుకొం టారు. ఒక దుకాణములో ఇల్లుతుడిచేవాడు, గృహపరిశ్రమలో సహాయముచేసేవాడు, హో టళ్ళలో ఉత్తరాలను తీసుకొనిపోయేవాడు, మం గళ్ళకు వడ్రంగులకు సహాయముచేసేవాడు, అంద రున్ను మూడేళ్ళు పనినేర్చుకొని, తమ వృత్తికి సంబంధించిన విద్యను "గవెర్బె షూలె"లో సంపా దించుకోవలెను. పనినేర్చుకొనడానికిన్ని, చదువుకు న్ను వారు ఏమీ ఇవ్వనక్కరలేదు. ఆయా య జమానులు వారికే కొంచెము సొమ్ము ఇస్తారు. ఈ బడులు పురపాలక సంఘముల వశముందుంటవి. గవర్నమెంటువారే వాటికయ్యేసొమ్మును పురపా లకసంఘములవారి కిస్తారు. కొన్నిస్థలాలలో గవర్నమెంటువారే పాఠశాలలను తమవశములోనే ఉంచుకొంటారు.

తరగతులను ఆయావృత్తులప్రకారము ఏ ర్పాటుచేస్తారు. ఒక వృత్తిని నేర్చుకొనే పిల్లలం దరున్ను ఒక్కటే తరగతిలో విద్యనేర్చుకొం

టారు. చదువు అయావృత్తులకుతగినట్లు ఉం టుంది. పిల్లలు పుస్తకములు చదువుకొనడమే కాకుండా అనుభవముకూడా సంపాదిస్తారు. ఈ వృత్తికాక, జర్మనుభాష, గణితము, చిత్రలేఖన ము, రాజనీతి ప్రథమపాఠములు, చిత్రా ఆవజ్ఞా లు వ్రాయడము, కసరత్తు, కూడా ఈ బడులలో నేర్పుతారు. తక్కిన బడులలోవలె వీటిలో కూ డా విహారములు, వ్యాయామక్రీడలు, నిర్బంధము లుగా ఉంటవి. ఆయావృత్తులలో మంచి ప్రజ్ఞ సంపాదించినవారే ఈబడులలో ఉపాధ్యాయులుగా ఉంటారు. ఒకొక్కవృత్తికి ప్రత్యేకముగా అను కూలించేటట్లు చిత్రలేఖనము, గణితము, క్షేత్రగ ణితము మొదలయిన విషయాలకు పాఠక్రమము లున్ను పాఠపుస్తకములున్ను వ్రాయబడి ఉన్నవి. వడ్రంగమునకు పనికివచ్చే గణితము, చిత్రలేఖన ము, మరిఒక వృత్తివారి కుపయోగించవు. వం డ్రంగముతరగతిలో కుర్చీలు మొదలయిన వాటి కుపయోగించే లెక్కలు, చిత్రలేఖనమును మా త్రమే చెప్పుతారు. ఇతర వృత్తులవారికి వారి

వారి వృత్తుల కుపయోగించేటట్లు చెప్పుతారు. శాసనముప్రకారము బడిలో వారమునకు 8 గంటలు మాత్రమే చదువుచెప్పవలసిఉన్నా, పది పండ్రెండు గంటలు కూడా చెప్పడము కలదు. యుద్ధమునకుపూర్వము జర్మనీలో ఈ బడులు 3,600 ఉండేవి. వీటిలో 540,000 మంది విద్యార్థులుండేవారు. యుద్ధము తరువాత ఈసంఖ్య నూటికి 50వంతున హెచ్చినది.

పెద్ద పారిశ్రామికపట్టణములలో, ఏదో ఒకవృత్తి నవలంబించే పిల్లలసంఖ్య ఎక్కువగా ఉన్నప్పుడు, ఆవృత్తికిసంబంధించిన విద్యార్థులకు ప్రత్యేకముగా పాఠశాలలను ఏర్పాటుచేసి "గెవెర్బె షూలె" నుంచి విడదీస్తారు. ఈఏక వృత్తి పాఠశాలకు "బెరుఫ్ షూలె" అనిపేరు. "గెవెర్బె షూలె"లో అన్ని వృత్తులకున్ను వేరు వేరుగా తరగతులు ఉంటవి; "బెరుఫ్షూలె"లో ఏదోఒక్కవృత్తినే బోధిస్తారు. కొన్నిస్థలాలలో వృత్తితరగతులను ప్రారంభపాఠశాలలకు చేర్చుతారు; ఈపాఠశాలలకు "ఫక్ క్లాసెస్" అనిపేరు.

పెద్దపట్టణములలోని ఈశార శాలలకు వసతిగృహ ములుకూడా చేరిఉంటవి. వీటికి "యూగెండ్ షేమ్" అనిపేరు. వీటిలో పిల్లలు తమభోజన సదుపాయములను తామే చేసుకోవలెను.

ఈపార శాలలంలోని పాఠక్రమమును గవర్న మెంటువారు ఏర్పాటుచేసి ఉన్నారు. వీటిలో పనినేర్చుకొనే పిల్లలు వారక్కడనుండిన సంవత్సర మును బట్టి మూడు తరగతులలో ఉంటారు. వారి ఆఖరుపరీక్షను ఆయావృత్తులలో ఆరితేరినవారి సహాయముతో ఉపాధ్యాయులే చేస్తారు. ఒక పాఠశాలలో 25 వేర్వేరువిద్యలనుకూడా నేర్ప వచ్చును. జర్మనీలో ఆడపిల్లలు, మగపిల్లలుకూడా 14ఏళ్ళ ఈడువరకు నిర్బంధముగా సామాన్యవిద్య నేర్చుకోవలెనని ఇంతకుముందు తెలుప బడ్డది. ఆతరువాత వారు మరిమూడేళ్ళు నిర్బంధముగా కార్మికవిద్యనో వృత్తివిద్యనో నేర్చుకోవలెను. ఎక్కువనేర్పు అక్కరలేని వృత్తితీసుకొన్నవారు గాని, పనినేర్చుకొనడమునకు చేరనివారుగాని, "ఫోర్ట్ బిల్డింగ్ షూలె" (Fortbilding Schule)

అనే క్రొత్తరకముబడిలో చేరవలెను. "గెవెర్బె షూలె"లోను "బేరుఫ్ షూలె"లోను చేరని తక్కినపిల్లలందరున్ను ఈ బడులలో చేరవలెను. ఈబడులలో విశేషానుభవముకర లేని సామాన్య విద్యను చెప్తారుగాని, కొద్దిగానో గొప్పగానో అనుభవమునుకూడా ఇస్తారు.

ఉన్నతపాఠశాలా విద్య.

"ఫాక్ షూలె" (Fach Schule) లేక

వాణిజ్యపాఠశాలలు.

కార్మికవిద్య ముఖ్యోద్దేశము మేస్త్రీలను, గృహపరిశ్రమయజమానులను తయారు చేయడము. మేస్త్రీలు స్వంతముగా యంత్రములను నడుపవలెను. గృహపరిశ్రమయజమానులు కుట్టుపని, గడియారములు చేయడమూ, చిత్రములు వ్రాయడము మొదలయిన పరిశ్రములలో ఎక్కువ నేర్పు సంపాదించవలెను. ఇక్కడ ఎక్కువజ్ఞానము సంపాదించవలసి ఉంటుందిగనుక, ఈఉన్నత పాఠశాలలలో ఒక్కదానిలో ఒకొక్కవృత్తి మాత్రమే నేర్పుతారు. ఒకొక్కవృత్తికొకొక్క

పాఠశాలను ఏర్పాటుచేసినారు. "గవెర్బె షూలె"లో పిల్లలు తమవృత్తిలోనే చాలాకాలముండి బడిలో గంటగంటన్నర కాలముమాత్రమే ఉంటారు. "ఫాక్ షూలె"లో బడిలో ఎక్కువ కాలమున్నూ, వృత్తిలో తక్కువకాలమున్నూ గడుపుతారు. ఈబడులలోనికి ప్రవేశము దొరకడము కూడా కొంచెముకష్టమే.

ఈ"ఫాక్ షూలె"లో చేరేవారు ఒకసామాన్య ఉన్నతపాఠశాలలో ఆరేళ్ళు చదువుకొని ఉండవలెను-లేదా, మాధ్యమిక పాఠశాలలో ఆరేళ్ళు చదువుకొని ఉండవలెను-లేదా, ఒక బోర్డుపాఠశాలలో ఎక్కువపరిజ్ఞతో చదువుకొని ఉండవలెను. "ఫాక్ షూలె"లో మూడేళ్ళు చదువుచెప్పుతారు. వారమునకు 30 గంటల నుంచి 40 గంటలవరకు పనిఉంటుంది. మొదటి సంవత్సరము పుస్తకములచదువు ఎక్కువగాను, అనుభవము తక్కువగాను ఉంటుంది. రెండోయేడు సమానముగా ఉంటవి. మూడోయేడు అనుభవము ఎక్కువగాను, పుస్తకముల చదువు

తక్కువగాను ఉంటుంది. ఈమూడేళ్ళలోను వి
ద్యార్థి తనవృత్తికి సంబంధించిన ఒకవస్తువును సం
పూర్ణముగా చేయడమును నేర్చుకోవలెను. ఉదా
హరణమునకు గడియారములను చేయడమునేర్చే
బడిలో చిన్నఇస్కూ౽ృళ్ళనుంచి, చక్రములవరకు
తానేచేసి, వాటినన్నిటిని ఒకగడియారముగా కూ
ర్చడము నేర్చుకోవలెను.

మూడేళ్ళచదువున్ను అయిన తరువాత
వాణిజ్యమంత్రిశాఖవారు పరీక్షకులను నియ
మిస్తారు. ఈపరీక్షకులకు పిల్లలు తాముచేసిన
వస్తువులను చూపవలెను. "ఫాక్ షూలె" విద్యా
ర్థులకు "లెహ౯లింగె" (Lehrlinge) అనిపేరు.
పరీక్షప్యాసయినవారికి "గెసెల్లె" (Geselle)
అనిపేరు. పరీక్షకు "గెసెల్లె పూ్రిఫుంగ్"
(Geselle Prurfung) అనిపేరు. "గెసెల్లే"లు
ఫాక్టొరీలలోగాని, చిన్నదుకాణములోగాని, పని
నేర్చుకొనడానికి చేరవచ్చును. వీరికి జీతా
లిస్తారు. ఇట్లు మూడేళ్ళు పనినేర్చుకొంటూ
ఉన్నకాలములో వారు బడులకు పోవలెననే నిర్బం

ధము లేదు, కాని, మూడేళ్ళయినతరువాత ఒక పరీక్ష ప్యాసుకావలెను. ప్యాసయితే "మాస్టర్" (Master) అనగా ఆవృత్తిని ఆమూలాగ్రముగా నేర్చుకొన్నవాడు, అనే బిరుదమునిస్తారు. ఈ పరీక్ష ప్యాసయితేనే కాని, ఎవరున్నూ స్వతంత్రముగా దుకాణము పెట్టుకొని తమవృత్తిని అవలంబించ నివ్వరు.

జర్మనులపరిశ్రమలకు ఈబడులు మూలాధారములు. ప్రతివృత్తిపాఠశాలను ఇచ్చట వర్ణించడానికి వీలులేదు. ఒక గడియారములు చేయడము నేర్పే పాఠశాలనుగురించిమాత్రము ఈక్రింద చెప్పబడుతున్నది. ఈ పాఠశాల డ్రెస్డెను పట్టణమునకు సమీపములో ఉన్న "గ్లాస్ హూటె" (Glasshut) అనే పట్టణములో ఉన్నది. ఇందులో మూడేళ్ళు చదువుచెప్తారు.

పుస్తకములపాఠములు (వారమునకు 10 నుంచి 20 గంటలవరకు):—

1. అంకగణితము, బీజగణితము, స్లైడు రూలు (Slide Rule) ఉపయోగించడము, టేబి

ళ్ళనుపట్టి లెక్కలుచేయడము, గ్రాఫులు, లోగరధిములు-వారమునకు 2 గంటలు.

(2) క్షేత్రగణితము, త్రిగుణమైత్రి (Trignometry) లోని ప్రథమపాఠములు.

(3) పదార్థవిజ్ఞానశాస్త్రము.

(4) విద్యుత్కర్మ శాస్త్రము (Electrotechnics)

(5) విద్యుత్ప్రవాహ శాస్త్రము.

(6) విద్యుత్సంజ్ఞల నివ్వడము.

(7) జర్మను భాష.

(8) ఆరోగ్య శాస్త్రము.

(9) చిత్రా ఆవర్జాలు వ్రాయడము.

(10) రాజనీతి ప్రథమపాఠములు.

(11) కసరత్తు.

(12) ఫ్రెంచిభాష, ఇంగ్లీషుభాష (ఐచ్ఛికము.)

అనుభవము (వారమునకు 30 నుంచి 40 గంటలవరకు):—

(1) రాపుపట్టడము (Filing), మెలివేయ

డము (twisting) ఉపకరణములను, యంత్రములను వాడడము.

(2) సూక్ష్మమానములను (Micrometers) వాడడము, పెద్దగడియారములనుగురించి తెలుసుకోవడము

(3) వాచీలలో కష్టమైన భాగముల నిర్మాణము, రాళ్ళనెక్కడ ఉంచడము, మూతలు చేయడము, జేబుగడియారములు, సిలెండర్లు చేయడము మొద.

(4) పళ్ళుగల చక్రములు, స్ప్రింగులు, విద్యుచ్ఛక్తితో పని.

(5) పెద్దగడియారాలలో పెండ్యులము, పెండ్యులములను సరియైన స్థానములలో ఉంచడము; స్త్రీల వాచీలు.

(6) మరమ్మత్తులు.

(7) వాచీని సంపూర్ణముగా నిర్మించడము.

### హాక్ షూలె (Hoch Schule)

(ఇంజనీరింగు కాలేజీలు)

ఈఇంజనీరింగు కాలేజీలు విశ్వవిద్యాలయ

ముల హక్కులను కలిగిఉన్నవి. వీటిలో డాక్టరు బిరుదమునిస్తారు. జర్మనీలో ఇటువంటికాలేజీలు ఇంజనీరింగు వృత్తికి పదిన్ని, వ్యవసాయమునకు నాలుగున్ను, అడవులకు అయిదున్నుఉన్నవి. తక్కిన విశ్వవిద్యాలయములలోనికి ఎట్లు ప్రవేశించడమో, వీటిలోను అట్లే ప్రవేశించవలెను. ఇందులో చేరదలచిన జర్మను విద్యార్థులు ఆబిట్యూరియెంటెన్ పరీక్షను, విదేశ విద్యార్థులు తమదేశములలోని విశ్వవిద్యాలయాలలోనికి ప్రవేశమునిచ్చేపరీక్షలనున్ను ప్యాసయిఉండవలెను. కాలేజీలో ఇంతమందిని మాత్రమే చేర్చుకొంటామన్న నియమములేదు. స్థలములేదన్న కారణముచేత ఎవరినిన్ని చేర్చుకోకపోరు. అందరు విద్యార్థులన్ను కలిసిపనిచేసుకొనడానికి సదుపాయాలులేకపోతే, తుకిడీలుగా పనిచేసుకొంటారు.

ఈ విశ్వవిద్యాలయాలలో రెండు పరీక్షలున్నవి. ఒకటి "డిప్లొమా" పరీక్ష. రెండోది "డాక్టరు" పరీక్ష. డిప్లొమాపరీక్ష బ్రిటిషు విశ్వవిద్యాలయాలలోని బి. ఎస్. సి. పరీక్షకు సరిపో

తుంది. డిప్లొమాపరీక్ష ఇవ్వడానికి విద్యార్థులు (1) ఒకవిశ్వవిద్యాలయములో నాలుగేళ్ళు చదువుకొని ఉండవలెను (2) ఒక సంవత్సరము అనుభవము సంపాదించుకొని ఉండవలెను. (3) పరీక్షలోని రెండు భాగములున్న ప్యాసుకావలెను. ప్రవేశించిన రెండేండ్ల తరువాత మొదటిభాగములో పరీక్ష జరుగుతుంది. ఈపరీక్షకు (1) గణితము (2) యంత్రనిర్మాణము (3) క్షేత్రగణితము (4) పదార్థవిజ్ఞాన రసాయనశాస్త్రములు (5) విద్యుద్యంత్రములు (6) ఉష్ణత (7) రాజనీతిశాస్త్రము (8) ఫాక్టొరీలను నడిపించడము, మొదలయిన విషయములుంటవి.

ఈమొదటి భాగములో రెండేండ్లకు పూర్వమే కృతార్థులయి, ఒకసంవత్సరమనుభవము పొందుతేనేకాని రెండోభాగముపరీక్షకు పోగూడదు. ఇంగ్లాండు, స్కాట్లాండు దేశములలో బి. ఎస్. సి. డిగ్రీలకుండే నియమములే ఈపరీక్షకున్నూ ఉన్నవి. డిప్లొమా పరీక్షప్యాసయిన తరువాత మరిరెండేండ్లకు "డాక్టరు" బిరుదపరీక్షకు పో

వచ్చును. దీనికి తక్కినవిషయములలోవలెనే పరీక్ష జరుగుతుంది.

ఒకఫ్యాక్టొరీలోగాని, పారిశ్రామికకంపెనీలో గాని ఏడేళ్ళయినా పనినేర్చుకొంటేనేతప్ప, ఎవరినీ ఈ"హాక్ షూలె"లో అధ్యాపకుడుగా నియమించరు. ఈ అధ్యాపకులకున్ను ఆయా పరిశ్రమాధికారులకున్ను మంచిపరిచయముంటుంది. అందుచేత విద్యార్థులకు ఆయాఫ్యాక్టొరీలలోనికి సులభముగా ప్రవేశము దొరుకుతుంది.

---

## అధ్యాయము ౧౬.

### వాణిజ్యవిద్య.

జర్మనీలో మొదట వాణిజ్య పాఠశాలను హాంబర్గు పట్టణములో 1771 సం॥రములో స్థాపించినారు. తరువాత మరి 20 ఏళ్ళకు బర్లినుపట్టణములో వాణిజ్యసంఘమువారు మరిఒకటి స్థాపించినారు. యుద్ధసమయములోను, ఆతరువాతను, సాధారణపాఠశాలలవలె వాణిజ్యపాఠశాలలను కూడా

ప్రారంభ, ఉన్నత, పాఠశాలలుగాను, విశ్వవిద్యాలయాలుగాను ఏర్పాటు చేసినారు. ఆయా వృత్తులలో ఉండి, వివిధ తరగతులలో విద్యను సంపాదించినవారు వీటిలో ప్రవేశించవచ్చును.

వాణిజ్య విద్యాలయములను (1) ప్రారంభ వాణిజ్యపాఠశాలలు (2) ఉన్నత వాణిజ్యపాఠశాలలు (3) వాణిజ్యకళాశాలలు—అని మూడు భాగములుగా విభజింపవచ్చును. వీటిపరిపాలనమున్ను, వీటిలోనికి ప్రవేశమున్ను కార్మిక వృత్తి విద్యాలయములలోవలెనే ఉంటుంది.

### ప్రారంభ వాణిజ్యపాఠశాలలు

వీటికి "కాఫ్ మానిషేన్ బెరుఫ్ షూలె" అనగా దుకాణదారుల పాఠశాలలనిపేరు. చిన్న పట్టణములలో ఈబసులలో చేరడానికి చాలినంత మంది పిల్లలు లేకపోతే సాధారణ వృత్తిపాఠశాలలలో ఈతరగతులుకూడా చేర్చుతారు. అప్పుడా పాఠశాలలను "కాఫ్ మానిషెస్ ఫాక్ క్లాసెన్" అంటారు. ఈ రెండువిధములైన పాఠశాలలలోను పాఠక్రమమొక్కటే. నిర్బంధ ప్రారంభవిద్యను

పొంది, దుకాణాలమీద పనినేర్చుకొంటూఉన్న బాలబాలికలను వీటిలో చేర్చుకొంటారు. వీటిలో పిల్లలు మూడేళ్ళు చదువుకోవలెను; పిల్లలకు జీతము లివ్వరు. పరీక్షప్యాసయిన తరువాత దుకాణముల మీద గుమాస్తాలఉద్యోగములు చేయడమునకు వారర్హులవుతారు. ఒక్క ప్రష్యియా దేశములో ఇటువంటిబడులు 607 ఉన్నవి; వీటిలో 386 ప్రత్యేకముగాను, 281 వృత్తిబడులకు చేరిన్ని ఉన్నవి. వీటిలోని పిల్లలసంఖ్య 130,225. ఆసంఖ్యలో ఆడ పిల్లలు 55,591. జర్మనుభాష, చిత్తా ఆవర్జాలు వ్రాయడము, టైపురైటింగు, సంక్షిప్తలేఖనము, వాణిజ్యశాసనముల ప్రథమపాఠములు, వాణిజ్య భూగోళశాస్త్రము, కసరత్తు, విహారములు— ఈ విషయములు తక్కినబడులలోవలె వీటిలోకూడా నిర్బంధములు.

### ఉన్నత వాణిజ్యపాఠశాలలు.

ఇవి (1) హాండెల్ షూలె (వాణిజ్యపాఠశాలలు) (2) హొహెర్ హాండెల్ షూలె (ఉన్నత వాణిజ్యపాఠశాలలు) అని రెండు విధము

లుగా ఉంటవి. మొదటివాటిలో మాధ్యమికపాఠ శాలలలో ఆరేండ్లు చదువుకొన్నబాలురు చేర వచ్చును. రెండోవాటిలో ఒక "జిమ్నేసియము" లో ఆరేళ్ళుచదువుకొన్న బాలురుగాని, ఒక "లిజ యము"లో చదువుకొని, అబిటుర్యారియెం శెర్ల పరీక్షప్యాసుకానట్టి బాలికలుగాని చేరవచ్చును. 1924 సం॥రములో మొదటిరకము బడులు 18,175 మంది విద్యార్థులతో 84న్ను, రెండోరకమువి 5,007 మంది విద్యార్థులతో 73న్ను ఉండేవి. ఈ బడులలో వాణిజ్యపాఠశాలలలోని ఉపాధ్యాయు లకు శిక్షణమిచ్చే ఏర్పాటులున్ను ఉన్నవి.

ఈక్రిందిపట్టిక ఆయాంతరగతులలో ఏయే విషయాలను ఎన్నెన్నిగంటలు ఈబడులలో నేర్పు తారో తెలుపుతుంది. వీటిలో నాలుగోతరగతి క్రిందితరగతి.

విద్యావిధానము ఉన్నత కార్మికపాఠశాల లలోవలె ఉంటుంది.

| | | 4 తరగతి | 3 తరగతి | 2 తరగతి | 1 తరగతి |
|---|---|---|---|---|---|
| 1. | మతము ... | 2 | 3 | 2 | 1 |
| 2. | జర్మనుభాష ... | 5 | 5 | 4 | 4 |
| 3. | ఫ్రెంచిభాష (ఉత్తరములువ్రాయడము తోకూడా) ... | 6 | 5 | 4 | 4 |
| 4. | ఇంగ్లీషుభాష ( ,, ) ... | 6 | 5 | 4 | 4 |
| 5. | గణితము .. | 2 | 3 | 3 | 3 |
| 6. | వాణిజ్య గణితము ... | 4 | 4 | 3 | 2 |
| 7. | పదార్థ విజ్ఞానశాస్త్రము... | 0 | 2 | 2 | 0 |
| 8. | రసాయన శాస్త్రము ... | 0 | 0 | 2 | 2 |
| 9. | జీవశాస్త్రము ... | 2 | 0 | 0 | 0 |
| 10. | వస్తువులు నిలువ చేయడము ... | 0 | 0 | 0 | 2 |
| 11. | వాణిజ్య భూగోళ శాస్త్రము ... | 2 | 2 | 2 | 2 |
| 12. | వాణిజ్య చరిత్రము ... | 2 | 2 | 2 | 2 |
| 13. | వాణిజ్యశాసనములు ... | 0 | 0 | 4 | 4 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 14. | దస్తూరి ... | 2 | 2 | 2 | 2 |
| 15. | సంక్షిప్త లేఖనము ... | 0 | 2 | 1 | 0 |
| 16. | కసరత్తు ... | 2 | 3 | 2 | 2 |
| 17. | చిత్రలేఖనము .. | 1 | 0 | 0 | 0 |
| 18. | సంగీతము ... | 1 | 0 | 0 | 0 |
| 19. | వ్యాయామ క్రీడలు ... | 2 | 2 | 2 | 2 |
| 20 | స్పానిషు, ఇటాలియను లేక రషియను భాష ... | 0 | 0 | 2 | 2 |

కళాశాలా వాణిజ్యవిద్య.

అబిట్యూరియెంటెన్ పరీక్ష ప్యాసయిన విద్యార్థులు వాణిజ్యకళాశాలలలో చేరవచ్చును. ఈకళాశాలలకు విశ్వవిద్యాలయాధికార మున్నది. అవి పట్టములనివ్వవచ్చును. ఇట్టి వాణిజ్యకళాశాలలు అయిదున్నవి. ఫ్రిబర్గ్సు కళాశాలలో వేయి మంది విద్యార్థులున్నారు. వాణిజ్యేతర కళాశాలలలోకూడా వాణిజ్యమును నేర్పడమున్నది.

తక్కిన విశ్వవిద్యాలయాలలోవలెనే వాణిజ్య కళాశాలలలోను రెండుపరీక్షలున్నవి. ఒకటి డిప్లొమాపరీక్ష. రెండోది డాక్టరుపరీక్ష. డిప్లొమా

పరీక్ష బ్రిటిషు విశ్వవిద్యాలయాలలోని వాణిజ్య (బి. ఎస్. సి.) పరీక్షకున్ను, డాక్టరు బిరుదము (పిఎచ్. డి.) బిరుదమునకున్ను సరిపోతవి. డిప్లొమా చదువు మూడేళ్ళు. డిప్లొమా పుచ్చుకొన్న తరువాత ఏవిశ్వవిద్యాలయములోనైనా మరి రెండేళ్ళుచదివి డాక్టరు బిరుదము పొందవచ్చును. విశ్వవిద్యాలయాలలో వాణిజ్యములో ఎక్కువగా పేరుపొందినవారు ఉపన్యాసాలిస్తారు. ఇచ్చటి విద్య కేవల పుస్తకస్థవిద్య కాదు.

ఈ వాణిజ్య పాఠశాలలు, కళాశాలలోనే కాక, పగటిపూట వృత్తిని చూచుకొనే పెద్దవారికి సాయంకాలము ప్రత్యేకముగా బోధించే పాఠశాలలుకూడా ఉన్నవి. వాణిజ్యవృత్తి నవలంబించే వారి విద్య సాధారణవిద్య, అనుభవవాణిజ్యము, వాణిజ్యవిద్య—అని మూడుభాగాలుగా ఉంటుంది. కొన్నిబడులలో వాణిజ్యవిద్య చెప్పి, తరువాత అనుభవమిస్తారు. కోటీశ్వరులుకూడా తమపిల్లలకు చిన్నక్లాసులలోనుంచి, పెద్దక్లాసులవరకు, వేగము వేగముగా వాణిజ్యవిద్య చెప్పిస్తారు. మంచి వాణి

జ్య విద్యసంపాదించినవాడు జీవితములో బాగుగా విజయు డౌతాడు.

---

## అధ్యాయము ౧౭.

### స్త్రీవిద్య.

మొదటినుంచిన్ని బాలురతోపాటు బాలికలనున్ను ప్రారంభ, మాధ్యమిక పాఠశాలలలో చేర్చుకొంటూనే ఉన్నారు. ఇద్దరికిన్ని పాఠక్రమ మొక్కటే; కాని, చేతిపనులలో భేదముండేది. ఆడ పిల్లలకు కుట్టుపని, వంట, దాదిపని, వీటితోకూడిన గృహ నిర్వాహకత్వము నేర్పుతూ ఉండేవారు. ఉత్తమపాఠశాలలలో మాత్రము బాలబాలికలకు భేదముకల్పించినారు. బాలుర కుద్దేశించిన ఉన్నత పాఠశాలలలోనికి, జిమ్నేసియములలోనికిని బాలికలను చేర్చుకొనేవారుకారు. అందుచేత వారుఆబి ట్యూరియెంటెన్ పరీక్ష ప్యాసయి కళాశాలలలో చేరడానికివీలుండేదికాదు. కాని, ఉపాధ్యాయినీ వృత్తి నవలంబింపదలచిన ఆడపిల్లలు కళాశాలలలో

ఉపన్యాసాలు వినడానికి అవకాశాలుకల్పించినారు. ఆడపిల్లలకు ప్రత్యేకముగా ఉన్నత పాఠశాల లుండేవి. వీటిలో ఆరేళ్ళు ఇతరవిషయాలతో బాటు వారు ఇప్పటి యూరోపియనుభాషఒకటి నేర్చుకొనేవారు. వారికి లాటిను, గ్రీకుభాషలు నేర్పేవారుకారు. హైస్కూలుపరీక్ష ప్యాసయిన ఆడపిల్లలను కళాశాలలో చేర్చుకొనేవారుకారు. హైస్కూలుచదు వయినతరువాత మరిమూడేళ్ళు చదువుకొనడానికి ఆడపిల్లలకు ప్రయివేటు వసతి గృహములు నేర్పాటుచేసినారు ఇక్కడ వారు ఇతరవిషయాలను నేర్చుకొన్నా, గృహనిర్వాహ కత్వము, కుట్టుపని, వంట, ఎక్కువగా నేర్చుకోవలసి ఉండేది. పిల్లలందరున్ను వసతిగృహములలో చిన్న చిన్నకుటుంబాలుగా ఏర్పడిఉండేవారు. వారు గదులు ఊడ్చి, ప్రక్కలుపరచి, వంతులు ప్రకా రము తమచిన్నకుటుంబమునకు వంటచేస్తేవారు. వంటకుకావలసిన సామానులపట్టీలను వారే వ్రాసు కొని, వారేకొనుక్కొనేవారు. ఈకుటుంబమ్ములు వారు తమ వంటయింటిపొందము, అందము, వంటల

రుచి విషయములలో ఒకరితో ఒకరు పోటీమీద పనిచేసుకొనేవారు. వీరికి చిత్రా ఆసర్జాలు వ్రాయడము, ప్రథమచికిత్స, రోగులను పోషించడము కూడానేర్పేవారు.

ఆడవాళ్ళు ఇళ్ళలో ఉండి, పిల్లలను చూచుకొంటూ ఉంటారనే ఉద్దేశముతో వారి విద్యాక్రమమును ముందర ఏర్పాటుచేసినారుకాని, వారి నిర్బంధములను సహించక ఆందోళనము చేయనారంభించినారు. దానిమూలముగా 1908 సం॥రములో వారికి "లిజియమ్" (Lyzeum) అనే ప్రత్యేకహైస్కూళ్ళను ఆరేళ్ళు చదువుకొనడానికి ఏర్పాటుచేసినారు. "ఓబర్—రియల్ షూలె"లోని కడపటిమూడుతరగతులలోను చదువుకొని వారు అబిట్యూరియెంటెన్ పరీక్షకు పోవడానికికూడా వీలుకల్పించినారు. ఈఏర్పాటు తృప్తికరముగా లేకపోవడముచేత హైస్కూళ్ళకంటె పైవిద్యాలయాలను (ఓబర్ లిజియమ్) (Ober-Lyzeum) 1917 సం॥రములో యుద్ధసమయములో ఏర్పాటుచేసినారు.

యుద్ధముకాగానే 1918 సంIIరములో స్త్రీలకు వోటుఇచ్చే అధికారము వచ్చినది. ఇదిగాక, మగవాళ్ళు యుద్ధమునకు పోయిఉన్నప్పుడు ఆడవాళ్ళకు హారిఉద్యోగము లిచ్చినారు. యుద్ధము కాగానే స్త్రీలు తమఉద్యోగములను మగవాళ్ళకు ఒప్పజెప్పడాని కంగీకరించలేదు. మగవాళ్ళతో సమానముగా మాకున్న విద్యాసౌకర్యములుండవలెనని కోరినారు. 1921 సంIIరములో విద్యాంగమంత్రి ఒకకాన్ఫరెన్సు చేసినాడు. దానిలో విద్యావిషయములో స్త్రీలకుండే నిర్బంధములన్నీ పోయినవి. ఇప్పుడు మంత్రిచేతిక్రింద, అతనికి స్త్రీవిద్యావిషయమై సలహాఇవ్వడానికి ఒక ఉద్యోగిని ఉన్నది.

ఇప్పుడు జర్మనుఆడపిల్లలు మొదట మగపిల్లలతోబాటు నాలుగేళ్ళు "గుర్డ్ షూలె" (సామాన్యవిద్యాలయము)నకు పోతారు. పదేళ్ళువయస్సున బాలురతోబాటు కొందరు ఉన్నతపాఠశాలలలోను, కొందరు మాధ్యమికపాఠశాలలలోను చేరుతారు. మిగిలినవారు ప్రారంభ

పాఠశాలలలోనే మరినాలుగేళ్ళు ఉంటారు. వృత్తి పాఠశాలలలోనికిన్ని సారిశ్రామిక పాఠశాలలలోనికిన్ని శాలుగవలెనే బాలికలున్ను నిర్బంధముగా పోవలెను. ఆడపిల్లలకు (1) కూలిపనివాళ్ళకుద్దేశించిన "ఔఫ్-బౌ-షూలె" నూతనోన్నత పాఠశాలలు (2) లిజియములు-అని రెండువిధముల ఉన్నతపాఠశాలలున్నవి. లిజియములో ఆరేళ్ళు చదువుకొని ఆడపిల్లలు (1] ఒకవసతి పాఠశాలలో చేరి గృహనిర్వాహకత్వము నేర్చుకోవచ్చును లేదా (2) మగపిల్లల జిమ్నాసియములో చేరవచ్చును, లేదా (3) లిజియమున కనుబంధముగాగాని ప్రత్యేకముగాగాని ఉండే ఓబర్ లిజియములో చేరవచ్చును. ఓబర్—లిజియములో మూడేళ్ళు చదువుకోవలెను. దీనిలోని తుదిపరీక్ష అబిటుర్యారియెంటెన్ పరీక్షతో సమానము. రెండుపరీక్షలున్ను ఒక్కరీతిగానే జరుగుతవి. ఈపరీక్షప్యాసయినవారు బాలురవలెనే బాలికలున్ను ఒక విశ్వవిద్యాలయములోగాని, కార్మికశాశాలలోకాని చేరవచ్చును.

విశ్వవిద్యాలయాలలో స్త్రీలసంఖ్య అతి వేగముగా వృద్ధిఅవుతున్నది. ఇప్పుడు మొత్తము సంఖ్యలో నూటికి పదిమంది స్త్రీలు విశ్వవిద్యాలయాలలో చదువుకొంటున్నారు. స్త్రీలు "స్టాటు" (Staat) పరీక్ష ప్యాసుకావచ్చును. డాక్టరు బిరుదమునున్ను పొందవచ్చును. స్టాటు పరీక్షను విశ్వవిద్యాలయాలవారే చేస్తారు. ఇది బి. యే. పరీక్షతో సమానము. ఇది ప్యాసయినవారు గవర్నమెంటు ఉద్యోగాలకు అర్హులౌతారు. స్త్రీలకు తమ కళాశాలలలో ప్రత్యేకసంఘములున్నవి. కాని, వీరు "క్లబ్బు"లలో పాల్గొనరు.

---

## అధ్యాయము ౧౮.

### ఉపాధ్యాయ శిక్షణము.

యుద్ధమునకు పూర్వము ప్రారంభపాఠశాలలోపాధ్యాయులు 'సెమినారు'లనే వసతిపాఠశాలలలో శిక్షణముపొందేవారు. ఈ పాఠశాలలకు ప్రారంభపాఠశాలలను చేర్చేవారు. సెమినారు

లలో చేరకపూర్వము ఉపాధ్యాయులు ప్రారంభ పాఠశాలలలోనో మాధ్యమిక పాఠశాలలలోనో చదువుకొనేవారు సెమినారులలో ఉపాధ్యాయులు మూడేళ్ళు చదువుకొన్న తరువాత ఒకకఠినమైన పరీక్ష జరిగేది. తరువాత వారు తిరిగీ బడులలో మూడేళ్ళు పనిచేసి మరొక పరీక్ష ఇచ్చేవారు. చదువుచెప్పడమునుగురించి పుస్తకములు చదువడమే కాక, చదువుచెప్పే అనుభవమునుకూడా సంపాదించేవారు. ఉపాధ్యాయశిక్షణమేమో సెమినారులలో బాగుగానే ఉండేదిగాని, వీరికి శాస్త్రజ్ఞానమేమిన్ని లేకుండేది. యుద్ధమునకుపూర్వమే ప్రారంభ పాఠశాలోపాధ్యాయులు హైస్కూళ్ళలోను, కళాశాలలలోను చదువుకొనకపోవడముచేత సంఘములో తమకు గౌరవములేకున్నదనిన్ని, కళాశాలా విద్యార్థుల స్వాతంత్ర్యము తమకులేదనిన్ని ఫిర్యాదు చేసేవారు. యుద్ధసమయములో ప్రారంభ పాఠశాలోపాధ్యాయుల కూతుళ్ళను పెళ్ళిచేసుకొనే సైనికోద్యోగుల ఉద్యోగములు తీసివేసేవారు. కాని, 1920, 1921 సంవత్సరములలో గవర్న

మెంటువారు ఉపాధ్యాయులకోసము ప్రత్యేక క
ళాశాలలను ఏర్పాటుచేసినారు. ఈకళాశాలలకు విశ్వవిద్యాలయాధికార మిచ్చినారు. ఈకళాశాలలు ఆయామతములప్రకారము ఏర్పడినవి. ఒకొక్కమతమునకు సంబంధించినట్లు వీటిలోఉపాధ్యాయశిక్షణ మిస్తున్నారు.

జర్మనీలోని ప్రారంభ పాఠశాలలు ఆయామతముల ననుసరించి ఉంటవనిన్ని, వీటిని ప్రభుత్వమువారు పోషిస్తారనిన్ని, ఈబడులలోని ఉపాధ్యాయులకు మతసంబంధమైన బోధనాభ్యసన పాఠశాలలలో శిక్షణమిస్తారనిన్ని, ఇంతకుముందుచెప్పబడినది. రోమనుకేథొలిక్కులు, ప్రొటెస్టాంటులు ఈరెండుమతములవారే జర్మనీలోముఖ్యులు. వీరిలో రోమనుకాథొలిక్కులకు ఒకటిన్ని, ప్రొటెస్టాంటులకు రెండున్ను. మతములతోసంబంధించనిది ఒకటిన్ని, బోధనాభ్యసన కళాశాలలు జర్మనీలో ఉన్నవి. ఈపాఠశాలలలో రెండేళ్ళు చదివిన తరువాత విద్యార్థులొక విశ్వవిద్యాలయములో చేరుతారు. ఈపాఠశాలలలో సాధారణముగా

బోధనాభ్యసన కళాశాలలలోనేర్పే విషయాలే కాకుండా, ఉపాధ్యాయులు బాలురకు నేర్పవలసిన విషయములనుకూడా బోధిస్తారు. ఈపాఠశాలలకు అనుబంధించి సాధారణ పాఠశాలలుండవు. విద్యార్థులు దగ్గరగా ఉన్న సాధారణ పాఠశాలలలో అనుభవము సంపాదించుకోవలెను.

ఈబోధనాభ్యసన కళాశాలలను ప్రత్యేకముగా ఉంచవలెనా, లేక విశ్వవిద్యాలయములకు చేర్చవలెనా, అని ఇప్పుడు తీవ్రమైన చర్చ జరుగుతున్నది. కొన్ని విశ్వవిద్యాలయములవారు వీటిని చేర్చుకొన్నారు. కొందరు చేర్చుకోలేదు. రోమను కేథొలిక్కులు తమమతమునకు భంగము కలుగుతుందేమోఅని. రోమను కేథొలిక్కులు వీటిని విశ్వవిద్యాలయాలలో చేర్చుకోకుండా అడ్డుతగులుతున్నారు. శాసనసభలలో వీరిసంఖ్య ఎక్కువగా ఉండడముచేత ప్రభుత్వమువారి కిష్టమున్నా వీటిని విశ్వవిద్యాలయములలో చేర్చడానికి వీలులేక పోతున్నది.

ఉన్నత పాఠశాలోపాధ్యాయుల శిక్షణము

కొంచెము వేరుగా ఉంటుంది. వీరు ఒకకళాశాలలో మూడేళ్ళు చదువుకొని "స్టాటు" అనేపరీక్షను మూడు విషయాలలో ఇవ్వవలెను-ఇదిగాక వారొక క్రొత్త విషయమునుగురించి ఒకవ్యాసమునువ్రాయవలెను- ఈపరీక్ష ఇంగ్లీషు విశ్వవిద్యాలయాలలోని బి. యే-పరీక్షకు సరిపోతుంది. ఈ పరీక్షలు ప్యాసయిన తరువాత ఉపాధ్యాయులు బోధనాభ్యసనకళాశాలలకు పోరు. వారిని ఆరుగురేసిచొప్పున హైస్కూళ్ళకుపోయి వాటి ప్రధానోపాధ్యాయుల తనఖీక్రింద బోధనానుభవమును సంపాదిస్తారు. అచ్చట రెండేళ్ళయిన తరువాత ఇక స్పెష్యల్ సంఘమొకటి ఏర్పడి వీరినిపరీక్షిస్తారు.

---

## అధ్యాయము ౧౯.

### జర్మను పరీక్షలు.

ఇంగ్లాండులోను, ఇండియాలోనువలె, జర్మనీలో నెలకొకసారి, ఏర్పుకొకసారి, సంవత్సరమునకొకసారి పరీక్షలులేవు. ప్రతిసంవత్సరమున్ను

పరీక్షలు చేసి పై తరగతులలో వేసేపద్ధతి ఆదేశములో లేదు. సంవత్సరమునకు మూడు టెర్ములు. టెర్మ ఆఖరున ఉపాధ్యాయుడు విద్యార్థిని గురించిన తనఅభిప్రాయమును ఒక రిజిష్టరులో వ్రాస్తాడు. ఈఅభిప్రాయాలు మాటలలో ఉండవు. ఎ, బి, సి, అనిగాని, 1, 2, 3, అనిగాని ఉంటవి. చాలాబడులలో ఇంగ్లాండులోనవలె ఎ+, ఎ,—బి+, బి—, సి+, సి—, మొదలయిన విభాగమున్ను ఉంటుంది. సంవత్సరాంతమున ప్రధానోపాధ్యాయుడు ఉపాధ్యాయుల సలహాలమీాదను, టెర్మ రిమార్కుల సహాయముతోను, పిల్లలను పై తరగతులలో వేస్తాడు. నూటికి పదిహేందికంటె ఎక్కువమందిని వెనుకకు ఉంచివేయడు. చదువు బాగుగ లేదని పిల్లలకున్ను వారితండ్రులకున్ను చాలాముందుగానే తెలియజేస్తారు. కాని, పరీక్షలలో ప్యాసయితేనేతప్ప ప్యాసుచేయకపోడు. ప్రతిబడిలోను, ఆటలు, వ్యాయామక్రీడలు, కసరత్తు, విధేయత, మంచినడవడి, తెలివితేటలకు కూడా మార్కులిస్తారు.

హైస్కూలులోని తుదిపరీక్షకు అబిట్యూరి మొంటెస్ పరీక్ష అనిపేరు. ఇదిప్యాసయినవారు విశ్వవిద్యాలయములోగాని, కార్మిక, వృత్తి కళా శాలలలోగానిచేరవచ్చును- అబిట్యూరిమొంటెస్ పరీక్ష విద్యార్థిపండొమ్మిదోయేట జరుగుతుంది. ఇది మన ఇంటర్మీడియేటు పరీక్షఅంత కఠినముగా ఉంటుంది. ఈపరీక్ష ఆమండలఇన్స్పెక్టరు తనిఖీ క్రింద, ఆయావిషయాలను చెప్పిన ఉపాధ్యాయు లే చేస్తారు. పరీక్ష వ్రాతలోను నోటితోను కూడా ఉంటుంది. ఒకొక్క పేపరులో ఒక్కప్రశ్నే ఉం టుంది. ఆవిషయమై విద్యార్థి ఒకవ్యాసమును వ్రాయవలెను. మనపరీక్షలలోవలె అనేకప్రశ్న లకు ఉత్తరములు వ్రాయనక్కరలేదు. ఉపా ధ్యాయుడు మూడుప్రశ్నలు వ్రాసియిస్తే ఇన్స్పె క్టరు వాటిలోనుంచి ఒక్కప్రశ్నను ఎంచుతాడు. సాధారణముగా పరీక్షకు మూడునెలలకుపూర్వము ఒకపరీక్ష చేసి, తుదిపరీక్షలో నెగ్గగలరనితోచినవా ళ్ళనే అబిట్యూరిమొంటెస్ పరీక్షకు పోనిస్తాడు. ఈ విధముగా వెనుక నుండిపోయేవారు నూటికి 15

గురుకంటె ఎక్కువముంది ఉండరు. వ్రాతపరీ క్షలో బాగుగా చేయనివారిని నోటితోకూడా పరీక్షిస్తారు. భాషాపరీక్షలలో విద్యార్థులు నిఘంటువుల నుపయోగించుకోవచ్చును. పరీక్షలలో ఏవోకొన్ని ముఖ్యవిషయాలలోనే కాని, అన్నిటిలోను పరీక్ష చేయరు. జిమ్నేసియము బడులలో భాషమీదను, ఓబర్-రియల్-షూలెలో భాషలు, గణితము, శాస్త్రముమీదను పరీక్ష చేస్తారు.

విశ్వవిద్యాలయములో డాక్టరు పరీక్ష ఒక్కటేఉంటుంది. దీనిలో తరగతులసీ ఒకతరగతిలోనుంచి మరిఒక తరగతిలోనికి వేయడమునిప్పుడుండదు. ఇండియాలోని పరీక్షలు ఇంగ్లాండులోని పరీక్షలను అనుకరిస్తున్నవి. జర్మనుపరీక్షలను గురించి తెలుసుకోవలెనంటే మన ఇప్పటిపరీక్షలను గురించి మరచిపోవలెను. జర్మను పరీక్షలు ఇంచుమించుగా మనదేశములో ఇంగ్లీషువారు రాకపూర్వ ముండేపరీక్షలను పోలిఉంటవి. డాక్టరు పరీక్షకుపోయేవారు ఒకఅధ్యాపకుని చేతిక్రింద పరిశోధనచేయువలెను. ఆ అధ్యాపకుడు విద్యార్థి

పనిలో సహాయము చేస్తూఉంటాడు. ప్రతిఒక అధ్యాపకుడు ఒప్పుకొన్న ఒకవిషయము మీద వ్యాసము వ్రాయవలెను. వ్యాసము సరిగాఉన్న దని ఒప్పుకొన్న తరువాత, ఒకసాయంకాలము ఏర్పరచి నోటిపరీక్ష చేస్తారు. ఈప్రతిఒక విద్యార్థి రెండువిషయాలను ఎంచుకొంటాడు. ఇవి తాను పరిశోధనచేసిన ముఖ్యవిషయమునకు సంబంధించి ఉండనక్కరలేదు. గణితములో పరీక్షఇచ్చేవాడు నోటిపరీక్షకు సంస్కృతమున్ను, భూగర్భశాస్త్రమున్ను ఎంచుకోవచ్చును. ముగ్గురు పరీక్షకులను ఏర్పాటుచేస్తారు. విద్యార్థి పరీక్షకు ముందుదినమున 10 గంటలకున్ను 1 గంటకున్ను మధ్య సాయంకాలపుదుస్తులువేసుకొని ఆ ముగ్గురు పరీక్షకులను చూడవలెను. "నీవేమి ఉపన్యాసాలు విన్నావు? ఏమిపుస్తకాలు చదివినావు?" అనివారతనిని అడుగుతారు. నోటిపరీక్ష సాధారణముగా రెండుగంటలు జరుగుతుంది. ఆయాఫాకల్టీల అధ్యక్షులు విద్యార్థి తీసుకొన్నవిషయమును గురించి తెలియని ఒకనిని నియమిస్తాడు; అతడు పరీక్ష

కులతో కూర్చొని జరిగినదంతా వ్రాస్తాడు. వ్రాతపరీక్షకంటె నోటిపరీక్ష చాలాకఠినముగా ఉంటుంది; సూక్ష్మపరీక్ష చేస్తారు. గుడ్డిపాఠముగా వల్లెవేయడానికి అవకాశముండదు. పరీక్ష జర్మను భాషలో జరుగుతుంది; కాని, అవసరమునుబట్టి ఇంగ్లీషులోకూడా చేస్తారు. విద్యార్థి పరీక్షాస్థలమును విడిచిపెట్టకముందే పరీక్షాఫలితమును చెప్పివేస్తాడు. పరీక్షలో తప్పిపోతే, ఆ అవమానము అతనికిచదువు చెప్పిన అధ్యాపకునిదిగాని, విద్యార్థిదికాదు. విద్యార్థి తనజీవితములో సంపాదించుకొనే కీర్త్యపకీర్తులుకూడా అధ్యాపకునివే. మనపండితులు ఫలానావారి శిష్యులమని చెప్పుకొన్నట్లే జర్మను డాక్టరుపరీక్షప్యాసయినవారు తమ అధ్యాపకుల పేళ్ళను చెప్పుకొంటారు.



## అధ్యాయము ౨౦.

### జీతములు. ఫించనులు.

జర్మనీలోని ప్రభుత్వోద్యోగులందరున్ను, ఏ శాఖలో పనిచేస్తున్నవారైనా పన్నెండు తరగతులుగాఉంటారు. ఒకొక్క తరగతిలోని వారందరికీ ఒకేరీతిగా జీతములిస్తారు. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులకు సంవత్సరమునకు 120 పౌనులనుంచి 200 పౌనులవరకున్ను, మాధ్యమిక పాఠశాలలలోనివారికి 120 పౌనులనుంచి 230 పౌనులవరకున్ను జీతాలిస్తారు. ఈ పాఠశాలలలోని ప్రధానోపాధ్యాయులకు మరి 50 పౌనులు ఎలవెన్సు ఇస్తారు. ఉన్నత పాఠశాలోపాధ్యాయులు ఓబర్ లెహ్రర్ (Ober Lehrer) అనిన్ని ఓబర్ స్టూడియెన్‌రాట్ (Ober Studianrat) అనిన్నీ రెండు తరగతులుగా ఉంటారు. యుద్ధానికి పూర్వము ఈ రెండోతరగతివారిని ప్రొఫెసర్లని పిలిచేవారుగాని ఇప్పుడా పేరు తీసివేసినారు. విశ్వవిద్యాలయాలలోని పెద్ద అధ్యాపకులను మాత్రమే ఇప్పుడు ప్రొఫేసర్లని పిలుస్తారు. ఉన్నత పాఠశాలోపాధ్యా

యులకు సంవత్సరమునకు 220 పౌనులనుంచి 420 పౌనులవరకున్ను ఇస్తారు. ప్రిధానోపాధ్యాయులకు సంవత్సరమునకు మరి 60 పౌనులు ఎలవెన్సు ఇస్తారు. ఇన్స్పెక్టర్ల జీతము సంవత్సరమునకు 310 పౌనులనుంచి 500 పౌనులవరకు ఉంటుంది. అందరున్ను 20ఏళ్ళలో పై మెట్టుజీతమునకు చేరేటట్లు ఏటేటజీతము హెచ్చుచేస్తారు. అరవై అయిదోయేట సాధారణముగా ఉద్యోగము చాలించుకొంటారు. నలభై యేళ్ళు పనిచేసినతరువాత జీతములో 5వంతులలో 4వంతులు ఫించను ఇస్తారు. ఉద్యోగి చచ్చితే, అతనిభార్యకు ఫించను అయిదోవంతున్ను వారిపిల్లల పోషణకోసము పిల్లలకింతఅని వారి 8 దేండ్లు వయస్సువరకు కొంతసొమ్మున్ను కూడా ఇస్తారు. ప్రొఫెసరుకు సంవత్సరమునకు 500 పౌనులనుంచి 800 పౌనులవరకు జీతమిస్తారు. వీరు సాధారణముగా అరవై అయిదోయేట పనిచాలించుకొన్నా, వారి ప్రొఫెసరుబిరుదముగాని, జీతముగాని పోదు. ఆతరువాత వారప్పుడప్పుడు విశ్వవిద్యాలయములో తమకిష్టముంటే ఉపన్యాసాలివ్వ

వచ్చును. ఉపన్యాసాలు వినడానికి విద్యార్థులు కొంతసొమ్మివ్వవలెను. ఆసొమ్మంతా ఊరిపై బయినవ్రొఫెసర్లకే ఇచ్చివేస్తారు.

---

## అధ్యాయము ౨౧.

### వయస్సుమించినవారి విద్య.

### ఫోక్ హోక్ షూలె (Volkhoch Schule)

చిన్నప్పుడు చదువుకొనడానికి మంచిఅవకాశాలు లేకపోయినవారు యావజ్జీవమున్ను చదువులేక ఉండనక్కరలేకుండా, వయస్సుమీరినవారికోసము జర్మనీలో బడులను ఏర్పాటు చేసినారు. యుద్ధమయిన తరువాత ఈవిషయమై మిక్కిలి శ్రద్ధ తీసుకొంటున్నారు. ఇటువంటి విద్యను మొదటఆరంభించినవారు డెన్మార్కువారు. 1844 సంIIరములో వ్యవసాయదారుల పిల్లలకోసము డెన్మార్కులో ఇట్టి మొదటి "ఫోక్ హోక్ షూలె"ను స్థాపించినారు. ఈబడి మొదట మతసంస్థగా ఉండేది. దీనిమీదజనుల కాదర మెక్కువ

కావడముచేత ఇటువంటివి మరికొన్ని లేచినవి. ప్రభుత్వమువారుకూడా ఇట్టిబడులను స్థాపించి విద్యావిధానములో చేర్చుకొన్నారు. 1918 సం॥రమున డెన్మార్కులో 6,640 విద్యార్థులతో 63 బడులుండేవి. వీటిలో చలికాలములో మగవారికి అయిదునెలలున్నూ ఎండకాలములో ఆడపిల్లలకు నాలుగునెలలున్నూ చదువుచేప్పేవారు. వసతిబడులలో 18 ఏండ్లనుంచి 20 ఏండ్లలోపు విద్యార్థులను చేర్చుకొంటారు. వీరిలో చాలామంది వ్యవసాయదారులు. వ్యవసాయానుభవ మెక్కువగాగల సాధారణవిద్యను వీరికిస్తున్నారు. వీరిలో పనికివచ్చినకొందరిని వ్యవసాయకళాశాలలకు పంపుతారు. ప్రస్తుతస్థితిని బాగుచేసి, మంచిపౌరులను తయారుచేయడమే ఈబడుల ఉద్దేశము.

వయస్సుమించినవారికి బడుల నేర్పాటుచేసేపద్ధతిని స్వీడను, నార్వేలవారుకూడా ఇప్పుడవలంబించినారు. వీటిని ప్రభుత్వమువారే పోషిస్తారు. ఇంగ్లాండులో ఈఉద్యమమును యూనివర్సిటీ ఎక్స్టెన్షన్ ఉపన్యాసాలుగా ఆరంభించినారు.

వీటిని మొదట కార్మికులుండే పట్టణాలలో మొదలు పెట్టినారు. ఈపద్ధతిని కేంబ్రిడ్జిలో 1871 సం॥రమున ఆరంభించినారు. దానిని తక్కిన విశ్వవిద్యాలయాలవారుకూడా అవలంబించినారు. ఇప్పుడీపద్ధతి ఎక్కువ ప్రచారములో ఉన్నది.

విశ్వవిద్యాలయాలలో అందరినీ చేర్చుకోనటమువల్ల చదువుకొనే వారిసంఖ్య ఎక్కువ కావడమేకాని, విద్యలో అభివృద్ధి కనబడదనిన్ని, విశ్వవిద్యాలయాలు పరిశోధనసాగించి, క్రొత్తవిషయాలను కనుక్కొని, తాముకనిపెట్టినదానిని జనసామాన్యమునకు తెలియజేయవలసినదనిన్ని లార్డు హాల్డేనుగారి అభిప్రాయము.

ఇంగ్లాండులోను ఈఉద్యమమారంభమయినప్పుడే జర్మనీలోకూడా ఆరంభమయినది. ఈ పద్ధతిప్రకారము మొదటిబడి 1879 సం॥రమున లేచినది. అప్పటినుంచిన్ని, ఇట్టి బడులెన్నో లేచినవి. పల్లెటూళ్ళలో ఇటువంటివి ఉన్నతపాఠశాలలుగా ఉంటవి. వీటిలో వ్యవసాయమును ఎక్కువగా చెప్పుతారు. 14 సం॥రములకున్ను,

17 సం॥రములకున్ను మధ్యవయస్సువారీ బడులకు నిర్బంధముగా పోవలెను. తక్కినవారికి ఐచ్ఛికము.

పట్టణములలోని బడులు అనేకరకములుగా ఉన్నవి. వీటిలో చాలామట్టుకు ప్రయివేటు బడులు. కొన్ని వసతులతోకూడిన క్లబ్బులుగా ఉంటవి. వీటికి పట్టణాలలో చాలామంది పోతూ ఉంటారు. వీటికి "యూగెండ్ షేమ్" (Yugendsheim) అనగా యూవనుల గృహములని పేరు. ఫాక్టొరీలలో పనిచేసే వయసువచ్చిన పిల్లలకు ఈబడిఅధికారులు పెండ్లిండ్లుచేసి, వసతి గృహములలో వసతులిచ్చి, సాయంకాలము వారికి ఉపన్యాసాలిస్తారు. ఇందువల్లవారు చెడు సహవాసములలో పడక, విద్యాభివృద్ధి చేసు కొంటారు.

20 లక్షలజనసంఖ్యగల బెర్లిను పట్టణములో ఇటువంటివి ఏడు ప్రయివేటుసంఘము లున్నవి. వీటిలో ఒకటి ఈక్రింద వర్ణింపబడినది.

ఈసంఘమును సభ్యులే ఎన్నుకొన్న కమిటీ వారు పరిపాలిస్తారు. సంవత్సరమునకు రెండుపి

ల్లింగులు చెల్లించేవారు సభ్యులవుతారు. వీరికి తక్కువజీతాలకే ఉపన్యాసాలు వినిపిస్తారు. చిన్న, పెద్దకంపెనీలవారుకూడా సంఘములో సభ్యులు కావచ్చును. చిన్నసంఘాలకు చందా సం॥ర మునకు 15 షిల్లింగులు; పెద్దవాటికి 30 షిల్లింగులు. ఈ సంఘమునకు బెర్లినుమ్యునిసిపాలిటీ వారు మొత్తముఖర్చులో నూటికినాలుగుచొప్పున గ్రాంటిస్తారు. ఖర్చులో నూటికి 2చొప్పున చందాలువస్తవి. మిగిలిన నూటికి 94 ఖర్చున్ను సభ్యులచందాలవల్లను, విద్యార్థుల జీతములవల్లను వస్తుంది. పదహారు వేర్వేరుబడులలో ఉపన్యాసాలిస్తారు. బెర్లినుమ్యునిసిపాలిటీవారు తమబడి గృహములను చదువుకోసము ఉచితముగా ఇచ్చి, దీపములఖర్చు, బంట్రోతుల ఖర్చుకూడా భరిస్తారు. ఈబడులు ఆయా మ్యునిసిపలుబడుల ప్రధానోపాధ్యాయుల తనిఖీలోఉంటవి. తమబడికాలములో కాక, సాయంకాలము ఈప్రధానోపాధ్యాయులే ఉపన్యాసాలిప్పిస్తారు. ఈసంఘము యాజమాన్యముక్రింది బడులలో 20,545 విద్యార్థులు చదు

వుకొంటున్నారు. యుద్ధసమయములోకూడా చాలామంది ఈబడులలో చదువుకొనడానికి పోతూ ఉండేవారు. వీటిలోని ఉపాధ్యాయులను విశ్వవిద్యాలయాలలోని అధ్యాపకులు, ఉపన్యాసకులలోనుంచిన్ని, ఉన్నతపాఠశాలలలోని ఉపాధ్యాయులనుంచిన్ని, సంఘకార్యనిర్వాహకవర్గమువారు ఏర్పాటుచేస్తారు. కార్మిక, వాణిజ్యవిషయాలను ఇంజనీర్లున్ను, వర్తకులున్ను బోధిస్తారు.

ఈబడులకు అన్నివయస్సులవారున్ను విద్యార్థులుగాపోతారు. 20 ఏళ్ళలోపువారు నూటికి 13రు, 21 నుంచి 30ఏళ్ళవారు 41 మంది, 31 నుంచి 40 ఏళ్ళవారు 23రు, 40ఏళ్ళపైబడినవారు 23రు ఈబడులలో చదువుకొంటున్నారు. ఈవిద్యార్థులు అనేకవృత్తులనుంచివస్తారు. దుకాణాలమీద ఫాక్టొరీలలోను పనిచేసేవారు నూటికి 51.8 మంది, ప్రభుత్వోద్యోగులు 14.4 మంది, కూలివాళ్ళు 11.6 మంది, ఇంజనీర్లు 6 మంది సామాన్యవృత్తులవారు 6 మంది, ఉపాధ్యాయులు 10.2 మంది ఇప్పుడు వీటిలో చదువుకొంటున్నారు.

ఈబడులలో పరీక్షలు చేసి, కావలసినవారికి సర్టిఫికేట్లు ఇస్తారు. ఉన్నత పాఠశాలాపరీక్షకు పోదలచినవారికి ప్రయివేటుగా చదువుచెప్పాతారు. వీరికి ప్రత్యేకముగా "తెలివితేటల పరీక్ష" అనే దానిని విద్యామ త్రిశాఖ వారేర్పాటుచేసినారు. ఈపరీక్ష ఆబిట్యుర్యారియొంటెన్ పరీక్షకు సమానము. ఈప్రయివేటు విద్యార్థులకు ప్రతిశనివారమున్ను పరీక్ష జరుగుతుంది.

---

## అధ్యాయము ౨౨.

### విద్యాపరిశోధనాలయములు.

విద్యాపద్ధతులలో ఏదోఒకటే శ్రేష్ఠమైన దని చెప్పవీలులేదు. ప్రభుత్వమువారు, విశ్వ విద్యాలయములవారు, ఇతర విద్యాలయములవారు కూడా క్రొత్తవిద్యాపద్ధతులను క్రొత్తరీతిగా బడు లను నడిపించడము కనుగొనడానికి ప్రతిదేశము లోను ప్రోత్సాహము కల్పిస్తారు. అమెరికాలో ఇట్టి విద్యాపరిశోధనాలయములు చాలాఉన్నవి.

ఈ అమెరికనువిద్యాపద్ధతులలో డాల్టను పద్ధతి, గారీ పద్ధతిఅనేవి ఈపరిశోధనలకు కొన్ని ఫలితము లనుకోవచ్చును. డాల్టనుపట్టణములో మిస్ ఎవెలిన్ ప్యూయిూ అనేఆమె అవలంబించినపద్ధతికి డాల్టను పద్ధతిఅనిపేరు. దీనిప్రకారము ఉపాధ్యాయులు పాఠముచెప్పరు. అంతా విద్యార్థులే నేర్చుకో వలెను. ఉపాధ్యాయులు సలహామాత్రి మిస్తారు. ప్రతివిద్యార్థికి వేర్వేరుగా ఉపాధ్యాయుడు బోధ స్తాడు. తరగతి మొత్తముమీద చదువుచెప్పడ ముండదు. ఈపద్ధతిని ఇండియాలో బాగుగా అవగాహనచేసుకొనలేక, దానినిపాడుచేస్తున్నారు. విలియమ్ ఏ. వర్టు అనేఆయన గారీ అనేపట్టణము లోని తనబడిలో అవలంబించిన పద్ధతికి గారీపద్ధతి అనిపేరు. "ప్రతివిద్యార్థికిన్ని ఒకస్థలముండవలెను. ఆవిద్యార్థి ఆస్థలమును విడిచిపెట్టకూడదు" అనే వాదమును వర్టుగారు నిరసిస్తారు. పార్కులలో ఒకొక్కమనిషికి ఒకొక్కస్థలమును నియమించడ మెట్లక్కరలేదో, బడిలోకూడా ఒకొక్క విద్యా ర్థికి ఏదో ఒకస్థలము నియమించ నక్కరలేదని

ఈతనివాదము. తనబడిలోనికి వచ్చేపిల్లలలో సగము మందికే అతడు స్థలముంచినాడు. తక్కినవారు ఆటస్థలములో చదువునేర్చుకొంటారు. ఇష్టము వచ్చినవారు గదులలో ఉండవచ్చును. తక్కినవారు బయటఆడుకోవచ్చును. ఈతడు సాయంకాలము పిల్లలతండ్రులను బడికిపిలిచి పిల్లలతో ఆడుకోనిస్తాడు. సంవత్సరమునకు 12 నెలలున్ను, వారమునకు 7 దినములున్ను బడిఉంచుతాడు. బడే పిల్లలకు ఇల్లన్నమాట. పిల్లలు బడిలోఉన్నంతకాలమున్ను బడే ఇల్లనుకొనేటట్లు చేస్తాడు.

జర్మనీలో కూడా విశ్వవిద్యాలయముల వారున్ను, ఇతరులున్ను ఇటువంటి విద్యాపరిశోధనాలయాలను స్థాపించి, క్రొత్తవిద్యాపద్ధతులను కనుక్కొనడానికి ప్రయత్నిస్తున్నారు. ఇటువంటిబడులలో ఒకటి ఈక్రింద వర్ణింపబడినది.

ఈబడికి ఇన్సెల్ షూలె (Insel Schule) అనిపేరు. ఇది బెర్లిన్‌పట్టణమునకు దగ్గరగాఉన్న ఒక ద్వీపముమీద ఉన్నది. బెర్లిను పురపాలక

సంఘమువారీద్వీపమునంతటిని ఈబడికి ఇచ్చివేసినారు. ప్రభుత్వమువారే ఇందులోని ఉపాధ్యాయులకందరికిన్ని జీతములిస్తారు. ఇదివసతిబడి. ఇందులో 83 గురుపిల్లలున్న 5గురు ఉపాధ్యాయులున్న ఉన్నారు. ఇందులోని పిల్లలందరున్ను తుదకు ఆబిట్యూరియెంటెక్ పరీక్షకుపోతారు. ఈ పిల్లలలో కొందరు గొప్పఇంటివాండ్లు. బడికి వైద్యుడు లేడు; ఆ రేళ్ళలో ఒక్కసారిమాత్రమే కావలసివచ్చినాడట; అప్పుడతనిని దగ్గరిపల్లెనుంచిపిలిపించినారు. సాధారణమైనతిండి మోతాదుగా తినడమున్ను. కావలసినంత వ్యాయామము చేయడమున్ను పిల్లల ఆరోగ్యమునకు మూలకారణము. ప్రొద్దుటిభోజనమునకు పూర్వము ప్రతివిద్యార్థిన్ని ద్వీపముచుట్టూ $1\frac{1}{4}$ మైళ్ళు పరుగెత్తవలెను. ఈబడిలో ఇప్పుడు రెండుపరిశోధనలు జరుగుతున్నవి.

(1) డాల్టను పద్ధతి:—తరగతిలోని పిల్లలకందరికీ ఒక్కసారి పాఠములుచెప్పరు. ఒకొక్కరికి ప్రత్యేకముగా చెప్పుతారు. ఈపద్ధతి ఇండి

యా దేశములో అనాదిగా ఉన్నదే. బ్రిటిషువారు రాకపూర్వము బడులలో తరగతులపద్ధతి లేదు. తరగతిమొత్తముమీద పాఠములుచెప్పితే కాల ముతక్కువ అవుతుందని సాధారణముగా మనమను కొంటాముగాని, ఈబడిలోని ఉపాధ్యాయుల అభి ప్రాయము వేరు. తరగతిమొత్తముమీద చె ప్పడమువల్ల కాలముకలిసిరాదనిన్ని, ఉపాధ్యాయు లకు మాత్రము సులువనిన్ని వారిఊహ. తరగతి మొత్తముమీద పాఠములుచెప్పడమువల్ల తెలివి గలపిల్లలకే లాభముగాని, మొద్దుపిల్లలు మరింత మొద్దులవుతారు. మధ్యరకముపిల్లలమీదనే ఉ పాధ్యాయులదృష్టి ఉంటుంది; అందుచేతవారు మి క్కిలి తెలివైనపిల్లలను, మొద్దుపిల్లలను నిఘాలో ఉంచుకోరు. ఈ జర్మనుబడిలో తరగతిఅనే అభి ప్రాయమును తొలగించడానికి, పిల్లలనువర్గము లుగాఉంచి, ఒకొక్కవర్గమువారికి ఒకొక్కరంగు గురుతుగాఉంచుతారు. ఒకొక్కప్పుడు ఉపాధ్యా యులు ఒకొక్క విద్యార్థికిన్ని ప్రత్యేకముగా పా ఠముచెప్పుతారు. ఒకప్పుడొకటేపాఠముకోసము

ఇద్దరుముగ్గురిని కలిపి చెప్పుతారు. పిల్లలు పాఠము కోసము ఉపాధ్యాయులదగ్గరకు పోరు; ఉపాధ్యాయులే పిల్లలవద్దకుపోతారు. బడిపెద్దల(మోనిటర్ల) పద్ధతి ఈబడివారి కిష్టములేదు; అనగా తెలివైన పిల్లలను మందమతులకు పాఠములు చెప్పడమునకు ఏర్పరచరు. దానికి బదులుగా ఉపాధ్యాయుల సంఖ్యనే ఎక్కువచేయుడము లాభకరమని వారి అభిప్రాయము.

(2) సామాన్యజీవనమున కలవాటుచేయుడము:—ఇదిపరిశోధనలో ఉన్న రెండోపద్ధతి. ద్వీపమంతటిలోను పిల్లలవంటకు ఇద్దరు ఆడవాళ్ళుతప్ప, మరెట్టినౌకరులునులేరు. ద్వీపములో రోడ్లను, బడిగదులను, వసతిఇండ్లను, పిల్లలేతుడుచుకొంటారు. పక్కలను తామే పరుచుకొంటారు. భోజనచావడిలో భోజనముచేసే టేబిలును తామేసర్దుకొంటారు. తిన్న కంచాలను తామే కడుగుకొంటారు. ద్వీపములోని కోళ్ళను, ఆవులను, వ్యవసాయపొలమును తామే చూచుకొంటారు. ఈపనులు చేయడానికి నౌకర్లను నియమించరు. యూరోపులో

వ్యవసాయమంటే గుర్రాలకు, గొర్రెలకు, పంద్లకు తిండిపెట్టడముకూడాను.

బసకు, తిండికి, ఆటలకు, రోజుకు విద్యార్థి ఒక్క-షిల్లింగు మాత్రము చెల్లించవలెను. యూరోపులో ఇతరచోట్ల ఈషిల్లింగు ఏమూలకున్ను చాలదు. ఉపాధ్యాయులు పిల్లలతోకలిసి, భోంచేస్తారు. బడిఖర్చుకోసము బడిపిల్లశ్రమయే చాలును; ఒకవేళచాలకపోతే తల్లిదండ్రుల నడుగుతే ఆలోటు పూర్తి చేస్తారు.

ఇటువంటి బడులు విద్యాపరిశోధనముకోసము ఇంకాఅనేకరకములవి ఉన్నవి.

---

## అధ్యాయము ౨౩.

### బడులలోని వస్తు ప్రదర్శనశాలలు.

ప్రతిదేశములోను విద్యకుసంబంధించిన వస్తుప్రదర్శనశాల లుంటవి. ఇంగ్లాండులో ఇట్టిప్రదర్శనశాల దక్షిణకెన్సింగ్టనులోని శాల కనుబంధముగా ఉంటుంది. ఉపాధ్యాయులు పిల్లలను

అక్కడకు తీసుకొనిపోయి, బడిలో చెప్పిన పాఠము లకు తగినబొమ్మలను చూపవలెను. జర్మనీలో ఈశాలలు ప్రత్యేకముగానే ఉంటవి. బడి వస్తు ప్రదర్శనశాలలను మొట్టమొదట ఏర్పాటుచేసిన వాడు పెస్టాలో'జీ అనేఅతను. పాఠమును చెప్పడ మేకాకుండా చూపవలెనని అతని అభిప్రాయము. ఆతరువాత పెద్దగోడపటములు వచ్చినవి. వాటి చిన్నప్రతులను తరువాత పాఠపుస్తకాలలో అ చ్చువేయడ మారంభించినారు. పిమ్మట ప్రతి దేశములోను గోడపటములు, ఉపకరణములు చేసి, కంపెనీలవా రనేకరకములవి అమ్మడమారంభించి నారు. వీటిలోనుంచి ఉపాధ్యాయులు తమకుకా వలసినవాటిని ఏర్చుకోవలసివచ్చినది. ఇందుకో సమే బడులలో వస్తుప్రదర్శనశాల అవసరముపడి నది. పిల్లలు చదువుకొంటే చాలదు, వస్తువులను పరిశీలించవలెనని పెస్టాలోజీఅభిప్రాయము. కాని కేవలపరిశీలనమువల్ల లాభములేదని ఇప్పుడను కొంటున్నారు. ఆయాపాఠములను పిల్లలు స్వయ ముగా ఆడవలెనని ఇప్పటి అభిప్రాయము. ప్రతి

పాఠమునకున్ను కాగితముమీద అచ్చువేసిన బొమ్మలేకాకుండా, గట్టిబొమ్మలుకూడా కావలెను. జర్మనీలో పిల్లలు ఈగట్టిబొమ్మలను తామే చేసుకొంటారు. కథాపాఠములను పిల్లలు గదులలో నాటకమాడుతారు. శాస్త్రవిషయాలకు, బడిగదులలో మేజాబల్లలుంటవి. వీటిమీద ఉపాధ్యాయులు ఆయాపనులను చేసిచూపడమేకాకుండా, పిల్లలచేతకూడా చేయిస్తారు.

ఈక్రింద జర్మనీలోని ఒక పాఠశాలావస్తు ప్రదర్శనశాల వర్ణింపబడినది. ప్రయివేటుగానే దీనిని ఏర్పాటుచేసినారుగాని, దీనికి ప్రభుత్వము వారు కొంతగ్రాంటు ఇస్తారు. ప్రతిప్రదర్శన శాలలలోను మంచిగ్రంథాలయమున్ను, పఠనాలయమున్ను ఉండవలెను. ఈశాలలోని గ్రంథాలయములో 20,000 పుస్తకములున్నవి; ఇవన్నీ విద్యాపద్ధతులకు సంబంధించినవే దీనికి 275 విద్యావిషయికపత్రికలను తెప్పిస్తారు. విషయముల ప్రకారము వస్తుప్రదర్శనశాల అనేకశాఖలుగా ఏర్పడిఉన్నది. శాలలోనికి పోగానే ఒక

ప్రిక్టు కింటర్ గార్టెస్ బహుమానములున్ను, ఒక ప్రిక్టు మాంటిసోర్ధీపరికరములున్న ఉన్నవి. ఒక్కొక్క విషయమును బోధించడాని కుపయోగించే పరికరములన్నీ ఒక్కొక్కగదిలో ఉన్నవి. ఒక్కొక్కరీతిబడికి బడికి ఉపయోగించే పరికరము లన్నీ వేర్వేరు అలమారాలలో ఉంచినారు. ఉదాహరణమునకు, భూగోళశాస్త్రపుగదిలో ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నతపాఠశాలలకు పనికివచ్చే పరికరములు వేర్వేరు అలమారాలలో ఉంచినారు. ప్రదర్శనశాలాధికారికి వ్రాస్తే ఈపరికరముల కేటలాగునుపంపుతాడు. ఈపరికరములను చేసే కంపెనీలవారు ఇండియాలోని శాశ్వతప్రదర్శనశాలలకు తమపరికరములను ఉచితముగా పంపుతారు. తమ వస్తువులలో మూడోవంతైనా చెల్లుతవని నమ్మకముంటే వాటిని తాత్కాలికప్రదర్శనశాలలకుకూడా పంపుతారు ఈవిషయమై "డైరెక్టర్ ఆఫ్ జెన్ట్రిల్ ఇన్స్టిట్యూషియోన్ ఫుర్ ఎర్జీ, హూంగ్ ఉంట్ ఉంటర్—రిక్ట్," (Director of Zentral Institution fur Erzichung und

unter-rict, 120 Liepriger Strassez, Berlin)
120, లీప్సిగర్ ష్ట్రెస్సె, బెర్లిను, అనివ్రాస్తే తెలుస్తుంది.

ఈప్రదర్శనశాలలో క్రొత్తగా మూడు విశేషములు చేరినవి.

(1) రేడియోగది:—దీనిలో బడులలో వాడుకలో ఉండే యంత్రముల మాదిరులన్నిటిని ప్రదర్శించిఉన్నారు.

(2) జీవశాస్త్రపుగది:— ఇందులో ఎముకలను వెంట్రుకలుకుక్కిన బొమ్మలను మాత్రమే ఉంచరు. మొక్కలున్ను, శవములున్ను చాలా కాలమువరకున్ను చెడిపోకుండేటట్లుచేసి, సారాయిలో ఉంచక, టేబిళ్ళమీదనే ఉంచుతారు.

(3) దేశపటములు వ్రాసుకోనక్కరలేకుండా, ఏదేశము, ఖండము, పటము, కావలిస్తే దానికితగిన లోహాపుఅచ్చులు ఒకగదిలో చేర్చినారు. వీటితో అచ్చుగుద్దుతే, పటములు చక్కగావస్తవి.

ఇదిగాక ఒక్కొక్కరకము బడిలో ఆయావిషయాలను నేర్పడానికి ఉపయోగములో ఉన్న

పరికరముల పట్టీని ఈ వస్తుప్రదర్శనశాలవారు ప్రకటిస్తారు.

---

## అధ్యాయము ౨౮.

### విశ్వవిద్యాలయములకున్ను,

### పారిశ్రామిక కంపెనీలకున్ను గల సంబంధము.

జర్మను విద్యావిధానములో విశ్వవిద్యాలయములకున్ను, పారిశ్రామిక కంపెనీలకున్ను గల సంబంధము చాలాముఖ్యమయినది. మొన్నటి వరకున్ను, ఇంగ్లాండులో పారిశ్రామికాధికారులు విశ్వవిద్యాలయములలోని ప్రొఫెసర్లది పుస్తకము చదువేగాని, అనుభవము లేదని వారిని తమకంపెనీలలో చేరనిచ్చేవారుకారు. వారుతమ అనుభవముమీదను తెలివితేటలమీదనే ఆధారపడేవారు. పరిశ్రమలరహస్యములను పైకి పొక్కనిచ్చేవారుకారు. అందుచేత, పరాయిమనుష్యులను తమ ఫాక్టొరీలోనికి రానిచ్చేవారుకారు. కాని, జర్మనీలో అలాగుచేయరు. ప్రతిఫాక్టొరీలోను ఒక

ప్రొఫెసరుంటాడు. అతనికింద పరిశోధనశాఖ ఉం టుంది. ఏరోజున బయలుదేరిన సమస్యలను ఆ రోజున ప్రొఫెసరుకు తెలుపుతారు. వాటికి ఉత్త రములను కనుక్కొని చెప్పవలెనని అతను తన శి ష్యులకు నియోగిస్తాడు. విశ్వవిద్యాలయాలలో తనకింద పనిచేసి డాక్టరు బిరుదమును పొందిన శిష్యులను ఈ ఫాక్టొరీలకుపంపి అనుభవమును ఇస్తాడు. కొన్నాళ్ళయినతరువాత వారికి ఫాక్టొ రీలలో ఉద్యోగములు లభిస్తవి. చిన్నఫాక్టొరీల లోని ఉద్యోగస్థులందరున్ను ప్రొఫెసరు శిష్యులే అయి ఉంటారు. పెద్దఫాక్టొరీలలో ఒకొక్కశా ఖకు ఒకొక్క ప్రొఫెసరుంటాడు.

ఈపద్ధతివల్ల ఫాక్టొరీలకు విశ్వవిద్యాలయా లకు కూడా లాభముగా ఉంటుంది. అధ్యాపకు లున్ను, వారిశిష్యులున్ను తమపరిశోధనలను విను వక ఆయాపరిశ్రమలను అభివృద్ధిచేసే దృష్టితో ఉంటారు. ఫాక్టొరీలవారికి అత్యుత్తమమైన సల హాలు లభిస్తవి. ఇంజనీరింగు కళాశాలలలోను అనుభవశాస్త్రములను బోధించడమునకున్ను, ఫా

స్టాఫ్‌పని బాగుగా తెలిసిన ప్రఫెసర్లనే నియమిస్తారు. అమెరికాలో ఈజర్మనుపద్ధతి నిప్పుడిప్పు డవలం బిస్తున్నారు.

---

## అధ్యాయము ౨౫.

### ముగింపు.

యుద్ధమునకు పూర్వము జర్మనులకు సంస్థా నిర్మాణ విధానములో పెట్టినది పేరుగా ఉండేది. వారి సైన్యపుఏర్పాటులు మిక్కిలి సూక్ష్మముగా ఉండేవి. రషియాతోగాని, ఫ్రాన్సుతోగాని, యుద్ధముసంభవిస్తే, ఏసైనిక డెక్కడనుండి యుద్ధము చేయవలెనో కూడా ముందుగానే ఏర్పాటుచేసుకొన్నారు. వారేమేమిపనులుచేయవలెనో, ఏ రైలుబండి ఎప్పుడెప్పుడు బయలుదేరవలెనో, ఏ బండిలో ఏసైనిక డెప్పుడెక్కవలెనో, ఎక్కడకూర్చోవలెనో, అన్నీ ఎంతోకాలముముందే నిశ్చయించుకొన్నారు. తామనుకోని పరిస్థితులు తటస్థించినప్పుడు వారేమేమిచేయవలెనో మీది ఉద్యోగ

స్థులు చెప్పుతేనేకాని, వారికి తెలిసేదికాదు. ఈ సూక్ష్మనిర్మాణక్రమము జర్మనుజాతికి పుట్టులక్షణము. దీనిని గురించి ఒక చిన్న కథఉన్నది.

ఒక అధ్యాపకుడు పిల్లలను విహారమునకు తీసుకొని వెళ్ళడానికి ముందుగా చేయవలసిన విధానమంతా ఏర్పాటుచేసినాడట. ఏభైమంది పిల్లలు విహారమునకు వస్తామని పేర్లిచ్చినారట. విహారమునకు సంబంధించిన సూక్ష్మవిషయము లన్నీ కలిగిన కార్యక్రమమును 200 పుటలుగా అచ్చువేసినపుస్తకమును అధ్యాపకుడు ప్రతివిద్యార్థికిన్ని ఇచ్చినాడట. రైలు బళ్ళలోను, ట్రామూబళ్ళలోను, ఏవిద్యార్థి ఎక్కడకూర్చోవలెనో, హోటేళ్ళలోను భోజనటేబిళ్ళవద్దను ఎవడెక్కడ ఉండవలెనో, ఫాక్టొరీలకు పోయేటప్పుడు ఏవిద్యార్థి ఏ వర్గముతో కలసి ఉండవలెనో, అన్నీ అతడు వ్రాసియిచ్చినాడు. రైలు కదలడాని కారంభించేసరికి ఒకవిద్యార్థి రాలేదు. అధ్యాపకుడు కంగారుపడి "అయ్యో! ఏమిచేయడము" అని గోలచేయ నారంభించినాడట. అప్పుడొక ఇండియావిద్యార్థి ఆ

యునవద్దకు నెమ్మదిగా పోయి "అయ్యా, ఆవిద్యార్థి చెల్లించవలసినది చెల్లించినాడా?" అని అడిగినాడు. "చెల్లించినాడు" అని అతను జవాబిచ్చినాడు. "అయితే, ఆతనిస్థానములో ఈనాచేతికర్రనుంచి ప్రయాణముసాగించండి." అని విద్యార్థి చెప్పినాడట. అందరున్ను పక్కనవన్న బండిలో కదలినారట.

ఒక్క బహులలోనేకాక రాజ్యాంగవిషయములన్నిటిలోను ఈరీతిగా అతిసూక్ష్మవిషయములనుకూడా ముందుగా ఏర్పరుచుకొనడము జర్మనువారిలక్షణము. ఇంగ్లీషువారి కిట్టిలక్షణములేదు. ఆకస్మాత్తుగా ఏర్పడిన పరిస్థితుల నెదుర్కొనడములో వారికి ఎక్కువప్రజ్ఞ ఉన్నది.

జర్మనులు మిక్కిలిపాటుపడే స్వభావము గలవారు. యూరోపులోని అన్ని జాతులవారికంటె జర్మనులు ఎక్కువపాటుపడతారు. విశ్వవిద్యాలయాలలో ఎండకాలములో ఉదయం 6 గంటలకున్ను, చలికాలములో 7 గంటలకున్ను పని ఆరంభించి, రాత్రి తొమ్మిదిగంటలవరకు పనిచే

స్తారు. మధ్యాహ్న భోజనమునకు రెండుగంటలు మాత్రము విరామముంటుంది. ఇంతకష్టపడినా, ఆటలు, వ్యాయామములు ఎక్కువగాగల ఇతర జాతులవారికంటె జర్మనులు ఎక్కువబలము, ఆరోగ్యము కలిగి ఉంటారు.

యుద్ధమునకు పూర్వము, కైజరు యాజమాన్యముక్రింద ఆ యా జర్మను రాష్ట్రములు ఒక్కటిగా చేరినవి. వీరిలో ప్రష్యారాష్ట్రము వారి పలుకుబడి ఎక్కువగా ఉండేది. ఇప్పుడు కైజరు అవలంబించినపద్ధతిపోయినది; జర్మనుభాష, జర్మనువిజ్ఞానము మాత్రమే జర్మనుసామ్రాజ్యమును ఒక్కటిగా నిలబెట్టుకున్నది. ఇప్పటి జర్మను రాజ్యాంగములో ఏదో ఒకరాష్ట్రమునకే ఎక్కువపలుకుబడిలేదు. ఇరవై ఆరు రాష్ట్రముల లోను ప్రతిరాష్ట్రమున్ను జర్మను సామ్రాజ్యము తనదిగా భావించుకొంటుంది. రాష్ట్రములన్నీ ఒక సామ్రాజ్యమయి ఏకముగాఉండడము లాభకర మని జర్మనులు గ్రహించినారు. కొద్ది కాలము లో తండ్రిరాజ్యముతో పర దేశములలో ఉండే

జర్మనువలస రాజ్యములు కలిసి ఏక సామ్రాజ్యముగా ఉండడమునకు మార్గమేర్పడినది. ఆర్థిక పరిస్థితులనుబట్టి ఈసామ్రాజ్యములో ఆస్ట్రియా మొట్ట మొదట చేరుతుంది. జెకో-స్లోవేకియాలోను, పోలాండులోను ఉన్న జర్మనులు తండ్రిరాజ్యము మీాద ఎక్కువ అభిమానము కలిగిఉన్నారు. తామిప్పుడు అస్వాభావికముగా ఉన్న దేశముమీాద వారికంత ఇష్టము లేదు. అచ్చటచ్చటవిడబడి జర్మనులున్న దేశములను ఆకర్షించే శక్తి జర్మను రాజ్యాంగపద్ధతికి ఉన్నది. బ్రిటిషు సామ్రాజ్యములో అట్లుకాదు; దీనిలో ఒక్క బ్రిటిషుదీవుల చేయి పైగా ఉన్నది. జర్మనీకివలె బ్రిటిషుసామ్రాజ్యమునకు ఒక రాజ్యాంగపద్ధతి లేదు. దీని వలసరాజ్యములు తల్లినుండి విడిపోయి తమ సంసారములను చూచుకొనే ఉద్దేశముతో ఉన్నవిగాని, వాటికి తల్లి యింటిలో పడిఉండవలెనని లేదు. తల్లికిన్ని తమకున్ను సామాన్యలక్షణము లేదు.

యుద్ధమయిన తరువాత జర్మనీవారు తమ విద్యాపద్ధతిని, రాజ్యాంగపద్ధతిని బాగుగాగాలించి

తిరిగి నిర్మించుకొన్నారు. జర్మనుపద్ధతిలో, అన్ని విధములైన విద్యాలయములలోని చదువులోను ఒకటితో ఒకటి సంబంధించిఉండడము ముఖ్యలక్షణము. పద్ధతి మొత్తముమీద ఆలోచించి ఏర్పరిచినది; దీనిప్రకారము ప్రతివ్యక్తికిన్ని ప్రత్యేకముగా విద్యాశిక్షణము దొరుకుతుంది. వ్యక్తి తా నవలంబింపదలచిన వృత్తి నెంచుకొనగానే, అత డెక్కడ ఏపుస్తకములు చదువవలెనో, ఎట్లు చదువవలెనో సమస్తమున్ను తెలిసియే ఉంటుంది. ఆచదువుకు కావలసిన సౌకర్యములన్ని ఆవ్యక్తికి సులభముగానే లభిస్తవి. ప్రతివ్యక్తికిన్ని కార్మిక విద్యను నిర్బంధముగా నేర్పే దేశము జర్మనీ ఒక్కటే. ఫ్రాన్సు ఈ నిర్బంధ కార్మికవిద్యను గురించి ఎంతోకాలమునుంచిన్ని ఆలోచిస్తున్నది; కాని, జర్మనీ ఈలోగా నిర్బంధకార్మికవిద్య నవలంబించి దానిలోని సూక్ష్మాంశములనుకూడా ఏర్పాటుచేసుకొన్నది.

ఆయావిషయములలో విశేష విజ్ఞానసంపన్నులను తయారుచేయడము జర్మను విద్యాపద్ధ

తికి మరియొక ముఖ్యలక్షణము. ఒక్క అధ్యాపకు లేకాక ప్రతివాడున్ను తనవృత్తిలో విశేషజ్ఞుడుగా ఉంటాడు. తనవృత్తినిదాటి, మరొకవిషయములో బడిపిల్లవానికంటె తక్కువగా ఉంటాడు. ఇప్పుడు జీవనము ఎక్కువపోటీతో సాగుతున్నది. ఇట్టిసమయములో విశేషజ్ఞత చాలాఅవసరమే. కాని, ఈపద్ధతి ప్రకారము మంచినాయకులు తయారుకారు. ఇంగ్లాండులో మంచిలాభముగా పనిచేసే కార్మికసంస్థలయజమానులు తమవృత్తిలో విశేషజ్ఞులై ఉండరు. కాని, వారికి మంచి విశాలమైన విద్యఉంటుంది; ఎక్కువ ప్రపంచానుభవముంటుంది. జర్మనీలో ప్రతివాడున్ను పరిశోధనముచేస్తాడు; ఇంగ్లాండులోను, ఫ్రాన్సులోను, మంచితెలివి తేటలుగలవారే పరిశోధనముచేస్తారు. గొప్పవిషయములను కనుక్కొనేవారు సాధారణముగా జర్మనులై ఉండరు. కనుగొన్న విషయమును సూక్ష్మాంశములతోకూడా విస్తరింపచేయుటములో జర్మనులకు పెట్టినదిపేరు. జర్మనీలో విశ్వవిద్యాలయములున్ను, పరిశ్రమసంస్థ

లున్ను అన్యోన్యసహాయముతో పనిచేసుకొంటవి. జర్మనుల పరిశ్రమాధిక్యతకు ఇదియే మూలరహస్యము.

పరిశ్రమలను అభివృద్ధిచేయడము, నిర్బంధ కార్మికవిద్య నేర్పడములలో జర్మనులకు ఎక్కువ శ్రద్ధఉన్నా, వారు ప్రాచీనవిషయపరిశోధనమును కడకంటితో చూడరు. ఈ విషయములను అభివృద్ధిచేయడమునకు విశ్వవిద్యాలయాలవారు ఎక్కువపాటుపడతారు. ఈవిషయములు జిమ్నేసియములలోను విశ్వవిద్యాలయాలలోని వేదాంతశాఖలలోను ఎక్కువగాఉన్నవి. యుద్ధానికి పూర్వమందువలె ఇప్పటున్ను ఈవిషయములమీద అభిమానము తగ్గలేదు. జర్మనులకు బుద్ధిస్వాతంత్ర్యము మెండు. ఇప్పుడు జీవితము ఆర్థికపద్ధతుల మీదనడుస్తూఉన్నా, జర్మనులకు ఆధ్యాత్మిక విషయములమీదనే ఎక్కువప్రీతి అని చెప్పవచ్చును.

(1) విశ్వవిద్యాలయాలలో మొదటచేరేటప్పుడు విద్యార్థికి తగినసలహాలేక ఒకసంవత్సరము వృథాగాపోవడము (2) రాజ్యాంగవిషయములలో

పరిజ్ఞసంపాదించడానికి కావలసినశీలము నభివృద్ధి చేయడానికి తగినవిద్య లేకపోవడము, అనేవి జర్మను విద్యాపద్ధతిలోని లోపములు.

మూడువందల సంవత్సరములనుంచిన్ని జర్మనీవారు తమవిద్యాపద్ధతిని అభివృద్ధి చేసుకొంటున్నారు. తమపద్ధతిని తలంచుకొని వారుగర్విస్తారు. ఇదిసహజము, న్యాయముకూడాను. సంవత్సరమునకు ఏటేటా పండ్రెండున్నరకోట్ల పౌనులను, ఇంతకాలమనేమి తిరేకుండా, మిత్రమండలి వారికి జర్మనీచెల్లించవలసిఉన్నా, ఈ విద్యాపద్ధతి మూలముననే, ఇంగ్లీషువారుతప్ప, యూరోపులోని అన్ని దేశములవారికంటెను జర్మనులు ఎక్కువ అభివృద్ధిపొంది, ధనవంతులై ఉన్నారు.

---